కథ
1951, జనవరి

# మెరుపు మెరిసింది



పగలు తొమ్మిదిన్నర.

వర్షం! వర్షం!

దిక్కుమాలిన వర్షం.

వర్షంతో గాలి, చలి, తడి, బురద.

ఏకధారగా వర్షం.

వర్షపు బాధ.

ఉంటే అతివృష్టి, లేకపోతే అనావృష్టి.

ప్రస్తుం అతివృష్టి బాధ.

గుమ్మంలో నిల్చుంది నీరజ, గొడుగు పట్టుకొని.

అద్దెగదులు రెండూ కురుస్తున్నాయి.

నేలంతా తడి.

ఆస్పత్రిలో పేషెంట్సులా గదంతా మాసిన బట్టలు. మాసిన గోడలు.

పాతకేలండర్ల మీద బొమ్మలు:

మాస్టర్ విఠల్, జాల్ మర్చంట్, ఇ.బిల్. మోరియా; మాధురి, గోహార్, సులోచన; – గోడమీద వేళ్ళాడుతున్నారు.

ఆమె చదువుకొనే రోజుల్లో హీరోస్ ఎన్డ్ హీరోయిన్స్ –

ప్రస్తుతం మాసిన గోడలనుంచి నవ్వుతున్నారు.

వారి నవ్వువైపు చూడ్డంలేదు నీరజ.

వీధిలోకి చూస్తోంది నీరజ.

వర్షం, వర్షం.

దడదడదమని వర్షం.
గొడుగు విప్పింది నీరజ. చిరిగింది గొడుగు అక్కడా అక్కడా.
వీధిలో అడుగు వేసింది నీరజ.
పగలు తొమ్మిదిన్నర.
పదిగంటలకి స్కూలు.
రెండుమైళ్ళు వెళ్ళాలి బస్సులో.
పది నిమిషాలు నడవాలి బస్సు స్టాండుకి.
వెయిట్ చెయ్యాలి బస్సుకోసం.
ఎంతసేపో?
వెళ్ళాలి బస్సులో, తడిలో, చింకి గొడుగుతో.
అందరూ కంపుకొడుతూ, బోన్లో ఎలకల్లా చస్తూ.
ఇవాళ స్కూల్కి వెళ్ళడం ఎలాగూ ఆలస్యం అవుతుంది.
లేటుగా వెళ్తే మబ్బుతో ఆకాశం మూసుకుపోయినట్టు
మూసుకుపోతుంది హెడ్మిస్ట్రెస్ ముఖం.
కానీ,
"వర్షం పడ్డానికి నేను కర్తనా?"
వర్షం పడుతోంది.
దిక్కుమాలిన వర్షం
1935లో చేరింది టీచర్గా,
ఇరవై సంవత్సరాల వయసులో,
ఇంటర్మీడియేటు పాసయేక.
అంతవరకు తన చదువు.
బియ్యేకి చదువుతామంటే,
ఇంటావంటా లేని డబ్బు
ఎదురుగా అడ్డొచ్చింది.
డబ్బు, డబ్బు.
జీవితాంతంవరకూ దానికోసం తాపత్రయపడ్డం
అదిలేక బాధపడ్డం.
ఎన్నాళ్ళిలా గడపడం?
చచ్చేవరకూ ఇంతే కాబోలు!
1935లో పెట్టుకున్న ఆశలన్నీ ఏవీ?
ఏవీ?
ఒక్కటీ లేదే!
లవ్!
రొమాన్స్!
మేరేజ్!
మనీ!
ఒక్కటీ లేదే!
ఆశలన్నీ మట్టిపాలయేయి.
నీళ్ళపాలయేయి.
నీళ్ళు. ఎక్కడ చూసినా నీళ్ళు.
కార్లు పోతోంటే బురదనీరు చీరమీదకి చిమ్ముతోంది.
తడిసిన చీర ఎలానూ తడిసింది.
కాని, ఈ తడిచీరమీద చలిబాధ మరీ హెచ్చుగా ఉంది.
గుండెల్లోంచి వణుకు పుట్టుకొస్తోంది.
"ముసల్దాన్నయి పోతున్నాను."
పదిహేనేళ్ళ క్రితం గాల్లో తేల్తూ స్కూలికి వెళ్ళింది.
అప్పుడు తనకి ఇరవయ్యేళ్ళు.
ఇప్పుడు ముప్ఫయ్యయిదు.
Niraja is thirty -five years old.
Old!!
"మసల్దాన్నయి పోతున్నాను."
ముప్ఫయ్యయిదు వర్షాల ప్రాయం నీరజది.
ముప్ఫయ్యయిదు వసంతాల ప్రాయం ఎందుక్కాకూడదు – నీరజది?
కాదు.
నీరజది వసంతాల ప్రాయం కాదు.
వర్షాల ప్రాయమే!
వర్షం, వర్షం.
జోరుగా, పక్కవాటుగా, పొడుస్తూ వర్షం.
పెళ్ళయితే తన పిల్లలు వెళ్ళవలసింది స్కూలికి.
పెళ్ళికాలేదు తనకి.
పెళ్ళయే ఆశలేదు.
వివాహయోగం లేని జాతకం.
ఒకప్పుడు పెళ్ళవుతుందని ఆశపడ్డది.
చాలాకాలం క్రితం.
ఇరవై సంవత్సరాల క్రితం.
పదిహేనేళ్ళ పడుచుపిల్ల.
పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్లడు.
పక్కింటినుంచి చూపులు.
పక్కింటిమీదికి చూపులు.
ఉత్తరాలా?
కాదు.
ప్రేమలేఖలు.
పెరట్లో.
చీకట్లో.
కౌగలింతలు.
నిద్దర్లో కలలు.
అంతే.
ఎవరిదారి వారిది.
అటుతరువాత?
ఇంకే ఆశా లేదు.
నీరజకి పెళ్ళిచేయించే వృద్ధులూ లేరు,
నీరజని పెళ్ళాడ్డానికి యువకులూ లేరు.
తనవైపెవరూ చూడలేదు, చూడరు.
తనెవరికీ అక్కర్లేదు.
"నా గతి ఏంకాను?"
ఇంతే, ఇలాగే, వర్షంలో, చలిలో, చింకి గొడుగుతో బడిపిల్లల పాఠాలు చెపుతూ, చెప్పలేకపోతూ –
ఆఖరికి చస్తే శవాన్ని మోసుకెళ్ళడానిక్కూడా ఎవరూ ఉండరు.
"ఛా! ఏమిటీ ఆలోచనలు?"
"అవికాక ఇంకేముంది?"
వర్షం. వర్షం.
బస్సు స్టాండ్ దగ్గర.
సైన్ పోస్టు తడుస్తోంది.

ఎవరూ లేరు.
ఎవరుంటారు నీరజ తప్ప?
ఆ సైన్‌పోస్టూ, తనూ తప్ప ఇంకెవరూ ఈ వర్షంలో తడవరు.
ఎండ కెండి వానకి తడవ్వలసిందే.
బస్సు ఎంతకీ రాదు.
ఇవాళ ఎలాగూ ఆలస్యం అవుతుంది.
డబ్బుంటే...
డబ్బు రావడం ఎలా?
అయ్యో రాత, డబ్బు రాదు.
అయ్యో రాత, ఈ బస్సు రాదు.
వస్తే ఆగకుండా పోతుంది, సీటుండదు.
Niraja always misses the bus.
అదిగో బస్సు దూరంగా.
బస్సులో నిల్చోవాలి.
ఏ మగాడూ లేచి తనకి సీటివ్వడు.
అందంగా ఉంటే ఇస్తారు.
నీరజకి అందం లేదు కాబోలు!
పై వాళ్ళకి తెలియాలి.
బస్సు తెగ జోరుగా వస్తోంది.
కారుని తప్పించుకుని వచ్చింది ముందుకు.
స్లోడౌన్ కాలేదు. రోడ్డు మధ్యగా వస్తోంది.
అయితే ఖాళీలేదన్న మాటే?
వచ్చింది.
వెళ్ళిపోయింది, పిచికారీలా నీళ్ళు చిమ్ముతూ.
అనుకున్నట్టుగానే అయింది.
వెయిట్ చెయ్యాలి మరో బస్సుకోసం.
వెనకాతల కారు మెల్లిగా వస్తోంది.
నంబరు 123.
నిల్చోవాలి నీరజ ఒకటీ రెండూ మూడూ అని నిముషాలు లెక్కెడుతూ.
జీవితాంతం వరకూ అలా లెక్కపెడుతూ నిల్చోవలసిందే.
ఆగని బస్సుల కోసం,
దొరకని సౌఖ్యాల కోసం,
తీరని కోరికల్తో,
తీరని బాధలో.
ఈ జీవితం ఆఖరయేవరకూ ఇంతే.
వర్షం, వర్షం.
బస్సుస్టాండు దగ్గర కారు ఆగింది.
ఇక్కడెందు కాగింది.
"మీరెక్కడికి వెళ్తారో తెలుసుకోవచ్చా?"
స్టీరింగ్‌వీల్ దగ్గర కూర్చుని వంగి చూస్తూ అడిగాడు.
ఒక్కడే ఉన్నాడు కార్లో.
జుట్టు తగ్గుతోంది, నుదురు ఎదుగుతోంది. ఎర్రటి కళ్లు, నల్లటి ఫ్రేమ్ కళ్ళద్దాలు, మట్టిరంగు ఉన్నికోటు, అదేరంగు నెక్ టై, నవ్వే ముఖం, ఆరోగ్యమైన శరీరం, నలభైలోపు వయస్సు.
అన్నీ ఒక్కక్షణంలో కనిపెట్టింది. ఆరితేరిన కళ్ళతో.
'మిడిల్ స్కూల్కి వెళ్లాలండీ."
'దార్లోనే ఉంది. మీ కభ్యంతరం లేకపోతే కూర్చోండి"
తలుపు తీశాడు.
వర్షం, వర్షం.
కార్లో కూర్చుంది, థాంక్సు చెప్పింది.
"దానికేం లెండి, చంపేస్తూంది వర్షం."
సిగరెట్టు వాసన. ఖరీదైన సిగరెట్టు వాసన.
రుమాలు తీసి ముఖం తుడుచుకున్నాడు. ఖరీదైన సెంటువాసన.
చేతిని వాచీలో ఆరు నిమిషాల్తక్కువ పది.
కారు కదిలింది.
నీరజ గుండె కదుల్తోంది జోరుగా.
కలవర పడుతోంది నీరజ.
చేతిలో ఉన్న గొడుగు వణుకుతోంది.
మాటాడ్డానికి ఏమీ తోచడం లేదు.
అతనే అడిగాడు.
"స్కూల్లో టీచర్‌గా ఉన్నారా?"
"అవునండీ"
అతని ముఖం నవ్వుతోంది.
"మిమ్మల్నెక్కడో చూసినట్టు జ్ఞాపకమండీ!"
ఆ మాటకి గుండెలెందుకో దడదడ కొట్టుకున్నాయి, రక్తం వెచ్చగా ప్రవహించింది.
పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్ల డెందుకో స్ఫురణకొచ్చేడు.
ఈ వయసే ఉంటుంది.
ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం!!
పిచ్చి ఊహ.
పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్లడు ఆనాడే పోయేడు.
రాడు రాడు మళ్ళీ రాడు.
కథల్లోనే మళ్ళీ కన్పిస్తారు పోయిన నాయకులు.,
ఆఖరిపేజీలో కనిపించడానికి ఇదేం నవల కాదు.
కాని, రక్తం జోరుగా ప్రవహిస్తోంది.
కారు జోరయింది. మలుపు దగ్గర కొచ్చింది.
మలుపుతిరిగింది. జోరుగా.
ఊపుకి అతని ఎడం భుజంమీద వాలింది.
వెచ్చగా, వెచ్చగా.
వెచ్చటి సువాసన. మగజంతువు వాసన.
వాంఛ రేగింది. ఆశ కలిగింది. సర్దుకొంది. సరిగా కూర్చొంది.
ముందుకి చూసేసరికి,
ఎదురుగా స్కూలు.
ఆగింది కారు.
"మెనీ థాంక్స్."
"నాటెటాల్."
"ఛీరియో."
"ఛీరియో."
అంతే.
పదిగంటలు సరిగా.
వర్షం వర్షం.
అమ్మయ్య! టైముకి వచ్చేను.
సంతసానికి ఇంతకుమించిన కారణాల్లేవు.
స్కూలుకి లేటుగా రాలేదు. క్లాసులో పిల్లలు అల్లరి చెయ్యలేదు.

ఇంటివాడు అద్దెకి పేచీ పెట్టలేదు. దుకాణంవాడు అరువు ఇవ్వడం మాన్లేదు.
ఇంతటి విషయాలే నీరజకి సంతృప్తి నిచ్చేవి.
నీరజా! నీరజా!
వర్షం, వర్షం.
కాని –
ఆ రాత్రి మనసు అకారణంగా తేలిగ్గా ఉంది.
వర్షం పడుతోంది. చూర్లోంచి నీరు దిగుతోంది. చలివేస్తోంది.
నీరజకి నిద్రరాదు.
రోజూ నైరాశ్యంవల్ల, దౌర్భాగ్యంవల్ల నిద్రరాదు.
కలిగిన ఆశవల్ల ఇవాళ నిద్రరాదు.
వర్షం వర్షం.
చలి, చలి.
ముణుచుకు పడుకుంటే మాత్రం వెచ్చగా తేలిగ్గా ఉంది.
మబ్బుల్లోంచి,
వర్షంలోంచి
తలుపుల్లేని కిటికీలోంచి,
చీకట్ని తోసేస్తూ,
మెరుపులు!
ఒకమెరుపు, ఒకటి; మరొక మెరుపు, రెండు; మరో మెరుపు, మూడు.
ఒకటీ, రెండూ, మూడూ.
వర్షంలో వాహనం.
వాహనంలో రసికుడు.
విత్తనం చిన్నదైనా మర్రిచెట్టు పెద్దదే.
"ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం."
పద్దెనిమిదేళ్ళ పడుచు పిల్లడు.
అనుకోకుండా ఆరంభిస్తుంది వలపు.
మెరుపు, మెరుపు, మరో మెరుపు.
మనసులో మెరుస్తున్నాయి ఆశల మెరుపులు.
"ప్రళయకాల మహోగ్ర.... మెరపేలా?"
ఏవిటిచెప్మా ఆ పాటా?
బాగా రాసేరెవరో.
ఎవరో ఆ కవి?
ఎక్కడున్నాడు–
పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్లడు?
వయసిప్పుడు నలభయ్యేళ్ళ దగ్గరుండదూ?
ఒకటీ, రెండూ, మూడూ.
అతన్దీ అదే వయసు.
నవ్వుతూండే ముఖం,
అదేదో సువాసన,
వాలడానికి వీలయే భుజం.
"ఏవిటీ ఆలోచన్లు నాకు?"
అతనెవరో, నే నెవరో?
మళ్ళీ కనిపిస్తాడా ఏమైనానా?
కనిపించడా?
మెరుపు
అదిగో మెరిసింది, కనిపిస్తాడు మళ్ళీ.
"నా గుండెలేనా కొట్టుకుంటున్నాయి?"

దడదడ ఒకొటి... దడదడ రెండు దడదడ మూడు...

వర్షంలో తడుస్తోంది తను. బట్టలు ముద్దయ్యాయి. కారు, రెక్కలకారు వచ్చి వాలింది. వర్షం ఎక్కడికి పోయింది; పరుపు ఎక్కణ్ణుంచి వచ్చింది? పరుపు, మెత్తటి పరుపు. శాలువాలు, వెచ్చటి శాలువాలు. పువ్వులు, కమ్మని మల్లెపూలు.

వంటిమీద సాఫ్టుసారీ, చెంపలమీద వేడి చేతులు, పెదవుల మీద వేడి పెదవులు. నున్నగా కమ్మగా వేడిగా... హెడ్ మిస్ట్రెస్ ఏడుస్తోంది. ఈర్ష్యతో ... ఏడవనీ.... వెచ్చటి పెదవులు.... చుట్టూ పిల్లలు.... పాలబుగ్గల పసిపిల్లలు... కేరుతూ ఆడుతూ.... రెక్కలకారు..... బ్యూటిఫుల్ టూసీటర్.... మెరుపులు... ముద్దులు.... సిగరెట్లు..... సువాసన్లు.... స్కూలుమీదకి మండే సిగరెట్టు.... మంటలు, మెరుపులు..... చలిమంటలు.... ప్రతి మంట దగ్గరా వెచ్చగా కూర్చొని అతను, తను... వెచ్చగా... హాయిగా....

ఆ మర్నాడు–
నీరజ నిద్రలేచింది.
వర్షం వెలియలేదు.
నష్టమేం లేదు.
బద్ధకం. తెగబద్ధకం.
అమ్మో! ఎనిమిదయింది.
గబగబా, గబగబా.
ఎందుకీ ఉత్సాహం?
ఏవిటా ఆశ?
"ఛా, నాకే ఆశా లేదు."
అయితే అకారణంగా ఎందుకీ సంతోషం?
కారణం ఉంది.
ఒకటీ, రెండూ, మూడూ.
అది కారణం.
నిజంగా అదే కారణం.
అబ్బే కాదు, మనస్సు వప్పుకోదు.
కాని అదే అదే, నిజంగా అదే.
వర్షం వర్షం.
పడాలి, ఇంకా పడాలి.
గబగబా తయారయింది, తొమ్మిదిన్నరకే.
నిన్నకూడా ఇదేవేళ.
నిన్నకూడా ఇదే వర్షం.
వర్షం వర్షం.
నిన్నా వర్షం.
ఇవాళా వర్షం.

బస్సు స్టాండుదగ్గర నీరజే వుంటుంది. మరెవరూ వుండరు. బస్సు రాదు. వచ్చినా సీటుండదు.

ఒకటీ, రెండూ, మూడూ,
".... అభ్యంతరం లేకపోతే...."
వెచ్చటి స్పర్శ. తియ్యటి వాసన.
ధబ్ ధబ్, ధబ్ ధబ్.
కొట్టుకుంటున్నాయి గుండెలు.
నడుస్తోంది నీరజ జోరుగా, తేలిగ్గా.
పదిహేను సంవత్సరాల క్రితం.
టీచర్‌గా చేరిన తొలిరోజుల్లో
ఇలాగే తేలిగ్గా వెళ్లింది.

కథ
1949

# విలువలు



**ఈ** కమర్షల్ సివిలైజేషన్లో
నా కరఘడియ సుఖమిచ్చేందుకు
ఆ స్త్రీ విలువ
రూపాయిన్నర.
మా కాంట్రాక్టుకి
నిర్ణయించుకోని కన్సిడరేషన్
ఒక రూపాయీ ఎనిమిదణాలు
వ్యక్తినిబట్టీ, సమయాన్ని బట్టీ, స్టేటస్ని బట్టీ, పర్సు బట్టీ విలువ హెచ్చావచ్చు.
లేక తగ్గావచ్చు.
కాని, ఆనాడు ఆమె నావద్ద పుచ్చుకున్నదంతే.
పొరపాటు.
ఆమెకి నేనిచ్చినదంతే.
అంతకన్న అధికం ఇస్తే ఆమె వద్దనకా పోను.
తక్కువిస్తే తగవు చెయ్యకాపోను.
అయితే ఆ వేళకి నే నివ్వగలిగినదంతే.
ఆనాడు,
బస్సుస్టాండు దగ్గర కలిసే నామెని,
బాగా చీకటిపడ్డాక.

పకోడీల దుకాణందగ్గర కిరసనూనె బుడ్డీ మందంగా వెలుగుతోంది. రెప రెపలాడుతోంది.

ఆమె కట్టుకున్న తెల్లటి చీరమీద ఎర్రటి మసక వెల్తురు దోబూచులాడుతోంది.

ఆ వెల్తుర్లో, నీడల్లో ఆమె మాసిన ఎఱ్ఱ రవిక అవుపించేలేదు నాకు.
కాని, అణగిన వంపులు అణక్కుండా పిలుస్తున్నాయి.
కిళ్లీతో ఎఱ్ఱబడ్డ పెదిమలు విలాసంగా వంకీలు తిరిగాయి.
కనుబొమ్మల క్రింద కళ్లు చిలిపిగా కదిలాడాయి.
నీలి కనుపాపలు మిల మిల మెరిశాయి, కొంటెగా సంజ్ఞలు చేశాయి.
నల్లటి కురుల్లో దాగిన జాజిమల్లెల వాసన ఉల్లిపాయ పకోడీల నూనె వాసనతో మిళితమయి గుమాళించింది.
నా చూపులు ఆమె వళ్ళంతా పాకినాయి.
ఆమెమీద నిల్చాయి.
నిలవకుండా, పొంగి వంగిన గీతలమీద జారాయి.
ఆమెని వదలకుండా తిరిగాయి.
చుట్టూ గొడవ, రొద, ధ్వని.
గుడ్డి వెల్తుర్నీ, మసక చీకట్నీ, ఎఱ్ఱ ధూళినీ ఆమె చూపులు చీలుస్తున్నాయి.
నన్ను లాగుతున్నాయి.
చుట్టూ గడబిడ, గందరగోళం.
కార్కు సోడాలకి ప్రాణాలు పోతున్నాయి.
శబ్దం చెయ్యడానికే తిరుగుతున్నాయి జట్కాల చక్రాలు.
సైకిళ్ళు, రిక్షాలు, కార్లు, బస్సులు, బళ్ళు, మనుష్యులు.
అన్నీ, అంతా కలిసి,
చుప్పుడు, చప్పుడు.
చప్పుళ్లో చప్పుడు చెయ్యకుండా పిల్చింది.
పిలవకండా రమ్మంది.
మాట్లాడకండా కదిలింది.
పోయే నామె వెంట,
మనసులో సందడితో,
ఒక్కటే కాంక్షతో,
అమిత కామంతో.
కలుసుకున్నా నావిణ్ణి మళుపులో.
మాట్లాడే నేదేదో
మాట లనవసరం అయినా,
ఇద్దరికీ వప్పుదలేనని,
ఇద్దరికీ తెలుసు.
వేరే అడగనక్కర్లేదు, చెప్పనక్కర్లేదు.
మళుపులో ఉన్న గ్యాస్‌లైటు వెల్తుర్లో ఆమె,
నల్లగా మెరిసింది;
ఎఱ్ఱగా నవ్వింది;
వేడిగా చూసింది.
ఇంతట్లో రిక్షా వచ్చి వాలింది.
అంతలోనే రిక్షాలో ఆమె, రిక్షాలో నేను,
రిక్షాలో మనిషి – పక్క మనిషి; చేతిలో చెయ్యి,
బలంగా, మోటుగా, గరుగ్గా ఉన్న చెయ్యి,
నా వాంఛని రేకెత్తించింది.
నన్ను కంపితుణ్ణిగా చేసింది.
రిక్షా పోతోంది సందుల్లోంచి,
ఆట్టే దూరంలేదు సుముద్రతీరానికి,
తెల్లటి ఇసక ఇంకా కొంచెం వెచ్చగా ఉంది.
నడుస్తూ నా భుజం పట్టుకొంది.
నా చేతిని లాక్కొని దాచేసుకొంది.
ఆమెవరో నే నడిగేనా?
నే నెవరో ఆమెక్కావాలా?
మౌనంగా నడిచి కూలబడ్డాం,
జాలరివాళ్ళ పడవలవార.
పడవల మధ్య మెత్తటి ఇసక.
పడవలమధ్య ఉప్పునీటి చేపల వాసన.
పడవలమధ్య చల్లటిగాలి.
పడవలమధ్య ఆమె నేనూ,
ఉక్కిరిబిక్కిరిగా ఉంది నాకు.
ఆపలేని తాపం కాళ్ళల్లో కంపం పుట్టిస్తోంది.
కంపిస్తున్న నన్ను బలంగా మోటుగా ముద్దులాండింది.
ఘాటైన వాసన.
చవకరకాల సబ్బు, స్నో, ఫేస్‌పౌడర్ కలిసి వేసే వాసన.
తడిసిన, మాసిన ఎఱ్ఱరవిక చెమట వాసన.
అన్నీ కలిసిన మనిషి వాసన.
పిచ్చెత్తించి కళ్ళకి పొరలు కప్పే ఆడదాని వాసన.
మధురమైన సువాసన.
చేతులు పెనవేసుకున్నాయి ఆమెని.
నా గుండెల గుబగుబల కామె వెచ్చటి రొమ్ములు జవాబులిచ్చేయి.
గుండెల తలుపులు తట్టేయి.
నెత్తురు వదరకి గట్లు తెంచేయి.
నా ఆచుకోలేని ఆరాటాని కామె సన్నగా నవ్వింది.
ఆ నవ్వుకి చీకటి వెన్నెల కాసింది.
రాత్రి చీకటిగా ఉంది.
చల్లగా వుంది.
ఆ చీకట్లో ఆమె నాక్కనిపించలేదు.
ఆమె సజల జలద నీలవర్ణం నీలిరాత్రిలో కలిసిపోయింది.
కాని, ఆ చీకట్లో ఆమె తప్ప నాకింకేదీ కనిపించలేదు.
పొంగిన వక్షాన్ని దిండుగా చేసుకొని,
ఆమె పెదవుల తీపిని తీసేసుకొని,
ఆమె సత్తువ నెదుర్కొని,
కలిసేను ఆమెని,
సముద్రుడి సమక్షంలో,
చంద్రుడు లేని ఆకాశాన్ని,
చాందినీ చేసుకొని.
నా రక్తం చల్లబడ్డాక,
లేచి కూర్చున్నాక,
తడుముకొంటూ
తీసేను జేములోంచి,
తీసినది పర్సు.
తీసేనే గాని,
ఎందుకో
చలిగా
చలిచలిగా
పుట్టుకొచ్చింది వణుకు
చేసినది పాడుపని కాదు.
చేస్తున్నది పాడుపని.

వెల లేనిదానికి వెల కడుతున్నాను.
అమూల్యమైన దానికి మూల్యం నిర్ణయిస్తున్నాను.
బజార్లో వస్తువులాగ
ఆనందాన్ని, ఆడదాన్ని కొనుక్కొంటున్నాను.
అణా యిస్తే పకోడీల పొట్లం దుకాణంలోంచి చేతిలో కొస్తుంది.
రూపాయిన్నర యిస్తే శేరుబియ్యం చీకట్లోంచి వెలుగులోకి వస్తాయి.
కాని వాటికి రోజునిబట్టి ఖరీదుంది, కొలతుంది, ఇంతకింత చొప్పున లెఖ్ఖుంది. అవన్నీ "వస్తువులు."
వస్తువుల క్రింద జమకట్టి కొనుక్కొనే ఈ మనిషి ఖరీదు నిర్ణయించలేదనీ,
కనీసం బేరమాడి ధరలెలా ఉన్నాయో కూడా తెలుసుకోలేనేలేదనీ,
అయ్యో, ఈ లోకంలో Fixed Prices లేని "వస్తువుల్లో" ఇదొకటనీ.
పర్సు తీస్తూంటే
గుర్తుకొచ్చింది.
నా కోరిక తీర్చుకొందికి
ఆడదాన్ని అద్దెకి తీసుకొందికి
ముందుగా
ధర కనుక్కోలేదు.
తనని తనే అమ్ముకోవాల్సిన
ఈ "వస్తువు"
నీచాతి నీచం
అంతటి హీనాతి హీనం.
పర్సు తీశాను.
ఆమె నన్ను గమనించడం లేదు.
ఎర్ర రవిక వెనక
నల్లటి రొమ్ములు దాగుంటున్నాయి.
తెల్లటి చీర కుచ్చెళ్ళు
మడతలు పడుతున్నాయి.
మల్లెపువ్వుల దండకోసం మోటుచేతులు
ఇసకలో వెతుకుతున్నాయి.
వెతుకుతున్నాయి
నా చేతులు
పర్సులో చిల్లర కోసం.
నా గుప్పెట్లో కొచ్చిన మూడర్థరూపాయిలు,
ఆమె మొలలోకి పోయాయి.
మౌనంగా పుచ్చుకుంది.
తరువాత
ఆఖరుసారిగా
నన్ను చేతుల్తో లాక్కొని
ముద్దు పెట్టుకుంది.
నవ్వింది.
తెలియని ఆనందంతో,
కాని, దుఃఖంతో,
అవమానంవల్ల కలిగిన సిగ్గుతో,
ఆమెని నేకూడా కావిలించుకొని
తలదాచుకున్నాను.
ఆరాత్రి
ఆమెని అవమానించినందుకు,
ఆమెనే కాదు, స్త్రీజాతిని అవమానించినందుకు,
స్త్రీజాతినే కాదు, మానవలోకాన్నే అవమానించినందుకు.
నన్నూ, ఆమెనీ
సర్వాన్నీ
అవమానించినందుకు,
మానవ జీవితం,
అనంతంగా సాగేందుకుగాను
మానవులకి భగవంతుడు
అయాచితంగా ప్రసాదించిన
అమరసౌఖ్యాన్నే
అవమానించినందుకు
నన్నూ
నా జాతినీ
తిరుగులేని ఘోర శాపాగ్నికి గురిచేసి
లేక,
కాళ్ళ కింద తొక్కి, మట్టితో కలిపి,
లేక
మంటలో విసిరి భస్మం చేయడానికి
బదులు
ఆమె నన్ను
బలమైన చేతుల్తో మృదువుగా కావిలించుకొని
పొంగిన పాలిండ్లకి మెత్తగా అన్చుకొని,
వెచ్చటి పెదవుల్తో తియ్యగా ముద్దులాడింది!
కాని –
తెలుసో తెలియకో నన్ను ఆ రీతిగా క్షమించడంలో
తన సహజ స్త్రీ లక్షణంతో నన్నాదరించి బుజ్జగించడంలో ఆమె తన ఔన్నత్యాన్ని చూపించింది.
తన ఔన్నత్యాన్ని తారాపథం దాటించింది.
అథోస్థానంలో ఉంటూ,
ఇంకా కిందకి జారిపోతున్న నాపై
వెన్నెల వర్షం కురిపించింది.
నాకు చేయూతనిచ్చి లేవదీసింది.
ఆడదాని మనస్సు చూపింది.
చివరకి
ఆమె వెళ్ళిపోయింది.
ఆ చీకట్లో
ఎక్కడికో,
ఈ కమర్షల్ సివిలైజేషన్లో
ధరల్లేని బజారులో
ఒకనాటి రాత్రి
వెలలేని దాని విలువ
రూపాయిన్నర!!

●

---

*వెలలేని దానివిలువ ఎంత పేరిట రాసినట్టుగా తెలుస్తోంది.*
*ప్రచురణ తేది, పత్రిక తెలియదు.*
*ఇంచుమించు 1949–50ల మధ్య ప్రచురితం*

కథ
1953, నవంబరు

# కిటికీ



ఒ...క....టీ... ఒ...క...టీ.....

అడుగులు నెమ్మదిగా వేస్తూ వెళ్తోంది పాతకఱ్ఱ.

అరిగిన పాతకఱ్ఱని పట్టుకున్న ఎండిన కొమ్మలాటి చెయ్యికూడా దాన్తోపాటు అలానే నెమ్మదిగా వెళ్తోంది.

విద్యుద్దీపాల వెలుగునంతటినీ ఆరబోసిన ముగ్గులా పరుచుకున్న సిమ్మెంటు రోడ్డు అంతే నెమ్మదిగా వెనక్కి జరుగుతోంది.

వెళ్ళగా, వెళ్ళగా ఆరబోసిన ముగ్గు గడ్డకట్టిన తారుగా మారింది.

కృష్ణసర్పంలా మెరిసే తార్రోడ్డుకూడా వెనక్కి జరిగి జరిగి ఆఖరయింది.

పాతకఱ్ఱ ఆగి సేదతీర్చుకొంది ఒక్కక్షణం.

ఇంకా ఎంతదూరం?

తారూ, కంకరా కలిసే స్థలంనుంచి ఇంకా యిరవై 'ఎలక్ట్రీ' దీపాలు దాటాలి. అక్కడనుంచి ఎడంచేతివైపు మళ్ళి, ఎనభయ్యడుగులు నడవాలి.

ఇరవై దీపాల కంకర్రోడ్డూ, ఎనభయ్యడుగుల కాలిబాటా దాటగా, ఎడమవైపున ఉండేది పాతమేడ;

కుడివైపున ఉండేది సగం కూలిన పెంకుటిల్లు.

ఆ పాతమేడ వినా ఆ ప్రాంతం విద్యుచ్ఛక్తితోగాని మరెట్టి కాంతితోగాని ప్రకాశించదు. అంతా అంధకారం.

ఎదురెదురుగా ఉన్న ఆ రెండు ఇళ్లూ దాటినతరువాత ఏవోవో తోటలూ, ఎవరెవరివో చిన్నచిన్న ఇళ్లూ లేకపోలేదు. కాని, ఎండిన చేత్తో ఆ పాతకఱ్ఱని పట్టుకున్న మనిషికి వాటి వేటితోనూ సంబంధం లేదు.

కూలిపోయే ఇంట్లో ఇంకా పూర్తిగా పడిపోకుండా నిల్చిన వరండాలో కూర్చొని చూద్దానికే అతను వెళుతున్నది.

క్షణంసేపు సేదతీర్చుకున్నాక, దీపాలు లెక్కపెట్టుకుంటూ, ఎంతో అలసిపోయినట్టుగా ఊపిరితీస్తూ బరువునడక సాగించేడు.

ఇరవై దీపాల దూరంగల కంకర్రోడ్డు ఎలాగయితేనేం వెనక్కి వెళ్ళింది. పాతకఱ్ఱ ఎడమవైపుకి మళ్ళింది.

ఇహ ఉన్నవి ఎనభయ్యే అడుగులు.

పైన చంద్రుడు లేడు. పక్కన మున్సిపల్ దీపాలు లేవు. నక్షత్రాల కాంతి అతనికంటికి చాలదు.

చాలా చీకటిగా ఉంది. కొంచెం చలిగాలి వీచింది.

చీకటిగా ఉన్నప్పటికీ చేతికఱ్ఱకి దారి బాగాతెలుసు. అలసిపోయినప్పటికీ ఎనభయ్యడుగుల మేరనీ తొందరగా వెనక్కినెట్టి నిట్టూర్చింది.

అదిగో కిటికీ!!

ఇదిగో వరండా!

పెంకుటింటి ముందు భాగం మాత్రం కొంత నిల్చింది. చీకటితో నిండిన ఆ వరండాపై కప్పు ఒక వార కొంతమేర కూలింది. క్రింద గచ్చు ఎన్నోచోట్ల, దాదాపు అంతటా గాయాలు పడింది. ఉన్న రెండు రాతి స్తంభాలకీ రక్తమాంసాల్లేవు. ఇంటికి ఇవతల నిల్చొని ఇంటిమీద క్కూడా విస్తరించుకుంది ఓ మామిడి చెట్టు. కప్పు కూలినవైపు వరండా మీద, ఆ మామిడి చెట్టుమీదా ఎదుట మేడలోంచి వచ్చే దీపం వెలుగు పల్చగా పడుతోంది.

ఆ వరండాలో చీకటిగా ఉన్న వైపు గోడని ఆనుకుని కూర్చొని, కఱ్ఱని పక్కనపెట్టి, ఎడం భుజాన ఉండే బరువుతీసి ఎదురుగా పెట్టుకొని, ఎదట మేడవైపు తలెత్తి చూశాడతను.

కిటికీ కనిపిస్తూనే ఉంది.

మిగతా మేడంతా చీకటి. ఆ కిటికీయే కనిపిస్తోంది.

చాలీచాలని నక్షత్ర కాంతి నిగనిగలాడే రాత్రిలో కరిగిపోతోంది ఎదట ఉండే పాతమేడా, మేడ వెనక తాటిచెట్లు వరసా, చీకట్లో కలిసీ కలయనట్టుగా ఉన్నాయి.

తాటిచెట్ల తలల్లోంచి చిన్నచిన్న చుక్కలు కనిపించని కదలికతో ఆకాశంలోకి లేస్తున్నాయి.

అవన్నీ చీకట్లో ఛాయలు, వట్టి నీడలు. ఆ నక్షత్రాలైనా, అవన్నీ, చీకట్లో మునిగిన, మెరుపు తగ్గిన రాళ్లు.

ఆ కిటికీ ఒక్కటే ఆ ప్రాంతంలో ఆ నిశీథంలో ధగధగలాడేది; జిగ జిగ మెరిసేది.

మేడమీద ఒకటే గది. సరిగ్గా ఆ గది వెడల్పునా దాని పక్కనే చిన్న డాబా ఉంది. గదినీ డాబానీ వేరుచేసే గదిగోడకి ఎదురుగా ఉంటుంది అతను కూర్చునే స్థలం. అతనికి ఎడమవైపుది గది, కుడివైపుది డాబా.

ఆ గది అట్టే పెద్దదికాదు. గదికి మధ్యగా ఉన్న ఆ కిటికీ చిన్నదికాదు. ఇనపవిగాని మరెట్టివిగాని కిటికీకి ఊచల్లేవు. తలుపులు తెరుచుకునే ఉంది. వెనక వెల్తురులో వజ్రంలా ప్రకాశిస్తోంది.

చిట్ట చీకటి తెరని ఆ కిటికీ ఉన్న ఒక్కచోటా కత్తిరించి అడుగున దాగున్న వెలుగుని ఎవరో చూపెడుతోన్నట్టుగా ఉంది. ఎవరో పుణ్యాత్ములు ఆ తెరని ఆమేరకి కత్తిరించో లేక ఒత్తిగిలించో అవకాశం కలిగిస్తున్నారు. ప్రతి రాత్రీ అతనలా చూసి సంతోషించడానికి, అనునిమిషం తన్మయుడవడానికి.

తెరవెనక అంతా ఆనందం.

అతనికి లేనిది, అతనికి కావాలని ఉన్నది, అందరికి ఉండాలని అతను కోరేది అంతా ఆ కిటికీ వెనక ఉంది, కిటికీలోంచి కనిపిస్తోంది.

కిటికీ వెనక ఉన్నది ఏమది?

తెల్లగా, వెల్లవేసిన గోడతో ఒకే ఒక గది.

చీకట్లో కూర్చున్న మనిషికి ఆ గదిలోన కనిపించేవి ఏమవి?

ఆకుపచ్చ గాజుటోపీ పెట్టుకొని, తీగని పట్టుకొని, గది మధ్యకి జారిన విద్యుద్దీపం; ధగధగలాడే దీపం వెలుగు; ఎదట గోడని బ్రాకెట్ మీద ఒక నీలిరంగు గాజు గడియారం; దానికి పక్కగా పెద్దదికాని ఒక అద్దాల బీరువా! బీరువామీద పేర్చిన నల్లటి గంధపు బొమ్మలు; వాటిమధ్య రంగులు వేసిన రెండు చిన్న పాలరాతి విగ్రహాలు – ఒకరు లక్ష్మి, ఒకరు సరస్వతి– బీరువాపైని గోడని ఒక పటం; అందులో, పడుకొని పుస్తకం చదివే ఆడమనిషి బొమ్మ; దానికి పైన గదికప్పు బిళ్ళ పెంకు; ఒకవార, దోమతెర కట్టిన పందిరిమంచపు కొన; కిటికీకి చేరువగా ఒక మనిషి కూర్చోవీలయే సోఫా;

ఇవన్నీ ఆ కిటికీలోంచి అతనికి సుస్పష్టంగా కనిపించకపోవడం చేతనే ఎక్కువ మనోహరంగా ఉంటాయతనికి.

ఆ గదితో,

వాళ్లిద్దరూ ఉంటారు!

వాళ్ళిద్దరే ఉంటారు!

ఆవిడ;

ఆమె ప్రాణం విచ్చిన పాలరాతి బొమ్మ; చిగిర్చిన తీయమామిడి కొమ్మ; వికసించిన కుసుమం; స్తంభించిన విద్యుల్లత; దిగివచ్చిన దేవత.

నవనవలాడే లేజవరాలు.

అతను;

అతని శరీరం మెరుగుపెట్టిన లోహం, అతన్ది కుతకుతలాడే రక్తం;

అతనొక కొమ్మపై వాలిన గండు కోయిల, అతను మనిషిగా మారిన మధుపం.

అత నామెకోసం దిగివచ్చిన దివ్యుడు.

అది గదిగా మారిన స్వర్గం. అది తెరవెనక స్వప్నం. అక్కడ నిత్య వసంతం.

తెరచిన తెరలోంచి, ఈ స్వప్నాన్ని, ఈ నిత్య వసంతాన్ని, ఈ స్వర్గాన్ని చూద్దానికే అతను నడచి నడచి నడచినడచి వస్తోంది.

ఎన్నాళ్ళనుంచి?

ఓ యాదాదవుద్ది కామోసు.

ఆ పట్నం వచ్చి సంవత్సరం అయింది. లేక, కావచ్చింది. వచ్చినరోజు రాత్రి దారితప్పి తిరుగుతూండగా, చీకట్లో దొంగచాటున వచ్చిన సికందరు సైన్యంలా; నల్లమబ్బులు అన్నివైపుల నుంచీ కమ్మేశాయి. కురిసేవరకూ వర్షం వస్తోందన్న సంగతి అతను గమనించనేలేదు.

ఒక్కసారిగా, గడగడలాడించే చలీ, మొత్తేసే జడివానా వచ్చిపడ్డాయి.

పక్కనేవున్న ఆ వరండాలోకి తననీ చేతికర్రనీ చప్పున చేరవేయవలసి వచ్చింది.

ఆ దినం వంట్లో బావుంది కాదు. అన్నం హితవుకాలేదు, సహించింది కాదు.

చూస్తోండగానే గుండె చెరువయింది.

వళ్ళంతా వడవడ వణకుతోంది. మనసంతా బరువుగా ఉంది.

– యెదవ యెదవ యెదవది బ్రతుకు,

ఈ రీతిగా ఎన్నాళ్ళు, ఎన్నాళ్ళయినా యెందుకు?

వీధిలో ఎండ, ఏటిలో నీరు, చెట్టుకింద నీడ,

ఎంతకాలం యిలా?

ఎక్కణ్ణించి ఎలావచ్చేను? ఇక్కడ యిలా ఎందుకు ఉంటున్నాను?

ఎప్పుడు ఎలా ఎక్కడికి పోతాను?

అనే ప్రశ్నలకి ఎవరికైనా జవాబులు తెలుసునేమో కాని అతని కటువంటి ప్రశ్నలు వేసుకోడం కూడా సరిగ్గా తెలీదు.

'నేను' అనే పదంయొక్క అన్ని విభక్తులతోనూ నిండిన ఈ లోకంలో 'పద్దం'చేత కలిగే నొప్పికి కారణం స్పష్టంగా కనిపిస్తూన్నా యెవ్వరికీ తెలియనట్టే అతనిక్కూడా తెలీదు.

వర్షం పడుతోంది. చలివేస్తోంది. అతను దుప్పటి దగ్గరగా లాక్కొని కప్పుకున్నాడు. అతని వళ్ళంతా పీకుతోంది.

– కాళ్ళడి పోతున్నై.

దూసుకువచ్చే చలిగాలి, జల్లుజల్లుగా జడివాన, మధ్యమధ్య మెరుపు నాలికలు, మాటిమాటికీ ఉరుముల ఘోష.

వానజల్లుకి వరండా తడుస్తోంది. సగం మాత్రం నిల్చిన చూర్లోంచి నీరు కురుస్తోంది.

–సత్తే శానాసుఖం. ఏం? ఓ పిడుగడకూడదా? పిడుగు పడిందికాదు. పిడుగులు ఎక్కడెక్కడో పడ్డాయి. మూలనున్న ముసలమ్మని కొట్టడం యెందుకని కాబోలు, పడిపోయే పెంకుటింటిని మాత్రం అన్ని పిడుగులూ విడిచిపెట్టాయి!

–నాలోటోణ్ణి చూసే దాతే లేడు. బగవంతుడే సూణ్ణప్పుడు ఆరిమాటా ఈరిమాటా సెప్పుకునేటి నాబం? పడే పిడుగులూ, చూసే దాతలూ, చూసీ చూడని భగవంతుడూ కూడా అంటకుండా దూరంలోనే ఉంటూ ఉండడం జరిగింది; జరుగుతోంది.

– ఈ పాలికి సత్తే బావుంటుంది.

– చస్తే బావుణ్ణు అని అనుకొనేంతవరకూ పరిస్థితి 'వచ్చింది' అనడం నిజం కాదు.

పరిస్థితి యెప్పుడూ అక్కడే ఉంది.

పరిస్థితులు యెప్పుడూ ఒక్కలాగే ఉన్నాయి.

జ్ఞాపకం ఉన్నంతమట్టుకు యెప్పుడూ ఇలాగే ఉంది అవస్థ.

ఎవరు కన్నారో వారు గుర్తులో లేరు.

దౌర్భాగ్యులు, పాపాత్ములు, శక్తిహీనులు, బానిసలు.

ఎవరైతేనేం? ఎవరో ఒకరు కన్నారు.

భయంతో కన్నవారు భయపడి పారిపోయారు.

ఇహ జ్ఞప్తికి వచ్చేదెలా?

పెంచిన ముసలమ్మ మాత్రం బాగా గుర్తులో ఉంది.

"నానేగాని చూడకపోతే ఆ పొద్దే సద్దువురా గుంటనాయదవ! ఇసివాసంగా బతకరా–"

అని మాటిమాటికీ చెప్తుండే ముసలమ్మ హింసించి హింసించి ఏనాడో పోయింది.

పోయేముందు ఈ దార్లోనే వదిలేసింది.

ముసలమ్మ నడిచి చూపెట్టిన దయ్యాలబాట వెంబడి నడవక తప్పడం లేదు.

మరో మార్గం కనిపించదు. ఎవరూ చూపించరు.

ఈ దయ్యపు బతుక్కి ఆనందం, సౌఖ్యం ఉండవు.

కాని –

కొన్ని – అతి తక్కువ– మధురస్మృతులు మాత్రం ఉన్నాయి.

అవి ఎట్టివి? ఎంత గొప్పవి? లేకుంటే ఎంత బీదవి?

పచ్చటి ముఖంతో, రూపాయంత బొట్టుతో, కుండంత కొప్పుతో, మందహాస రేఖతో ఓ ముసలావిడ, ఓ మధ్యాహ్నం దయతో పిల్చి, ఆదరించి దీవించి పంపింది. దీవెన ఫలించకపోతేనేం? దయతో దీవించడం ఎంత కాదు? ఒకనాడొక తప్పిపోయిన పిల్లని తల్లి దగ్గర చేరవేసినందు కాతల్లి ఒక సరికొత్త పంచె ఇచ్చింది. ఒకరాత్రి, తాగి తందనాలాడే సీమ సిపాయి అయిదు రూపాయలు పారేసుకున్నాడు. తన అన్నం కొంత పెట్టినందుకు ఒక రాత్రి ఒక ఆడమనిషి వంటిమీద చెయ్యి వేయనిచ్చింది. ఓనాడు కరవ్వచ్చిన వెర్రికుక్కని యెవరో వచ్చి తరిమి తరిమికొట్టేరు. ఓ సాయంకాలం ఓ పోలీసువాడు కొట్టకుండా విడిచిపెట్టేడు.

స్మృతిపథాన మధురంగా మెరిసేవి, ఇవిగాక!

ఓ వూళ్లో ఓ మధ్యాహ్నం, చెట్టుకింద గజ్జెకట్టి గంతులు వేసిన చక్కని ఆడపిల్లా, రెయిలుబండిలో కూర్చొని పిల్లడికి పాలిస్తూ ఒకసారి కనిపించిన వెన్నెలవంటి ఒక చల్లని తల్లీ, ఒక రాత్రి "ఊర్మిళమ్మ నిద్ర" పదంపాడిన జంగిలీవాడూ, ఓ సత్రంలో కూర్చొని ఒకరాత్రి చిలుంవేడిలో మంచుకొండ మహిమలు చెప్పిన బైరాగివాడూ....

వీళ్ళగురించి, వీటి గురించి తల్చుకున్నప్పుడుకూడా మధురంగా ఉంటుంది.

మిగతాదంతా,

గడ్డు, గడ్డు గడ్డు బతుకు.

కాలంతో ఉన్నన్నాళ్ళు, జబ్బుచేయనన్నాళ్ళు పరవాలేకపోయింది.

ఇప్పుడు కాలం బాగా మళ్ళింది. జబ్బుచేసింది. కర్ర పట్టుకొంటూంటే చెయ్యి వణుకుతోంది. చలికాలం కాకపోయినా చలివేస్తోంది. వేసవికాలం కాకపోయినా ఎండ భరించశక్యం కాకుండా వుంది. నిండినా నిండకపోయినా కడుపు ఒక్కలాగే ఉంటోంది, నిండకపోవడం పరిపాటవుతోంది.

బైట,

అంతటా వర్షం పడుతోంది. ఎక్కడో పిడుగుపడింది. మాటిమాటికీ మెరుస్తోంది.

అతను మాత్రం చూడకుండా, 'చస్తే యెంత బావుణ్ను' అనే విషయం గురించి ఆలోచిస్తూ కూర్చుండిపోయేడు.

చిన్న మగతనిద్ర పట్టింది కాబోలు.

ఇంతలో చూరునుంచి ఒక పెంకు జారిపడింది కాబోలు.

అందుకే కాబోలు అతనికి మెలకువ వచ్చింది.

కళ్ళు నులుపుకొని చిక్కటి చీకటితో నిండుకొని, అండాలతో నీళ్ళు గుమ్మరించిన ఆకాశం నిద్రలేచి చూసేసరికి నల్లగా నిగనిగలాడుతూ కంటికి స్పష్టంగా కనిపిస్తోంది. అందులో, వెదజల్లిన ముత్యాల్లాగ యెక్కడ యెటుచూసినా చక్కటి చుక్కలు వెలుగుతున్నాయి. మొత్తేసిన మేఘాల్ని చలిగాలి ఇంకోవైపుకి యెక్కడికో మోసుకుపోయింది. గాలి వీయడంలేదు. అంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కణ్ణించో అతిసన్నగా పాట వినిపిస్తోంది. అందుచేత మిగతా అంతా మరీ నిశ్శబ్దంగా ఉంది. స్నానం చేసి, కొత్తబట్టలు కట్టుకొని, పువ్వులు పెట్టుకొని, దీపంలేని గదిలోకి వచ్చిన ఆడమనిషి శరీరంలా ఆ రాత్రంతా ఎంతో చల్లగా ఉంది.

అంతా నిశ్శబ్దంగా వుంటూండగా, అతనలా చూస్తూండగా,

వెలుగు – వెలుగు వెయ్యిదీపాల వెలుగు ఒక్కసారిగా ముంచేసింది!

వీనుల విందుగా నవ్వేరెవరో!

దేవతలు దేవతలు. దేవతలెవరో నవ్వుతున్నారు!

అప్పుడే నిద్ర లేవడంచేత, ఎదట మేడ కనిపించకపోవడం చేత, అక్కడ ఇల్లున్నదని తెలియకపోవడంచేత, ఆకాశానికి తలుపులు తెరిచేరనే అనుకున్నాడు. స్వర్గంలో దేవతలు నవ్వుతున్నారనే అనుకున్నాడు. వెలుగుతోపాటు వాహినిగా ముంచేసిన పాట గంధర్వ గానమనే అనుకున్నాడు.

వళ్ళంతా జలదరించి, పులకరించి తన్మయత్వం పొందింది.

వెలుగులోంచి రెండు చేతులు బైటికి వచ్చేయి.

"జల్లు పూర్తిగా పోయిందండీ.... ఎంత చల్లగా హాయిగా ఉందో చూశారా!"

"నీ కంటేనా?"

ఆవిడ చేయీ అతని చేయీ లోనికి పోయాయి.

ఆవిడ అటువైపు తిరిగింది. తిరిగేలోపున అతనావిణ్ణి వెనక్కి లాగేడు.

ఎవరువారు?

మనుష్యులు కారు దేవతలు కారు; మనుష్యులు కాదు దేవతలే!

వీళ్ళనలా చూడాలనే అనిపిస్తోంది.

వాళ్ళని అలా చూడకుండా ఉండలేకుండా ఉన్నాడు.

❖ ❖ ❖

ఆనాడు వర్షం కురుస్తూండగా, మిక్కిలి చీకటిగా ఉంటూండగా 'ప్రాణంపోతే ఎంత బావుండేది అనుకొంటూ చిన్న కునకుతీసేడు. నిద్ర లేచేసరికి వర్షం వెలిసింది; ఆకాశం పువ్వులు విరిసింది! దేవతలు తలుపులు తెరచేరు.

ఆ క్షణానిది నిజంగా స్వర్గమే!

అందుచేతనే ప్రతిరాత్రీ అక్కడికి లాక్కుపోతుంది, ఆ అరిగిన పాత కర్ర.

వెళ్ళేసరికి కిటికీ తెరిచే వుంటుంది. దీపం వెలుగుతూనే ఉంటుంది.

వాళ్లు అక్కడే ఉంటారు. రేడియో పాడుతూనే వుంటుంది.

ఏడాదిక్రితం ఆ వూరు వచ్చిన తొలిరోజు రాత్రి ఆ కొన్ని క్షణాలూ "అది స్వర్గం; వారు దేవతలు" అని కలిగినట్టి ఆ భావన ప్రతిదినమూకూడా ఆ చీకట్లో అక్కడికి వెళ్ళిన కొన్ని క్షణాలు మళ్ళీ కలుగుతుంది.

ఆ కొన్నిక్షణాలుకూడా అతని మనసు గాల్లోతేలి, చుక్కల్ని జేరి, అమృతంలో మునుగుతుంది. మునిగి తేలి తీరిగ్గా కూర్చున్నాక అతని మనసు పోతుంది ఆ పాటతో.

పంచరంగుల పువ్వులతోటల్లోకి, తెల్లపావురాల మెడవంపుల మెరపుల్లోకి, కొండనీడల కులికే, చల్లనితోటల నీడల్లోకి, తెలిమబ్బుల తేలిపోయే గాలిమేడల్లోకి, చుక్కలబాటల్లోంచి, ముత్యాల ముగ్గుల్లోంచి, స్వప్నాల స్వర్గాలలోకి, స్వర్గాల స్వప్నాల్లోకి, అదీ ఆ కిటికీ.

అక్కడికి వచ్చి ఆ అనుభూతి పొందానికైనా బతకాలని ఉందతనికి. ఆ రాత్రినుంచీ బతికిస్తూ వస్తూన్నదే ఆ కిటికీ, ఆ కోరిక, ఆ అనుభూతి.

ఆకాశంకాదు; పాతమేడ, స్వర్గానికి సింహద్వారం కాదు; ఊచల్లేని కిటికీ. ఇంద్రనగరపు దీపశిఖరం కాదు; ఊళ్లో ఉండే మామూలు విద్యుద్దీపం. గంధర్వగానం కాదు; రేడియోపాట దేవతలు కారు; సామాన్య యువతీ యువకులు. అది స్వర్గం కానేకాదు; వెల్లవేసిన చిన్నగది.

అవొచ్చు. అంతే కావచ్చు. నిజం అంతేకూడాను. కాని ఆ నిజంతో అతనికి ప్రసక్తి లేదు.

ఇంద్రుని హర్మ్యం, స్వర్ణ కవాటం, రత్నఖచిత కుడ్యం, మాణిక్య దర్పణం, హంసతూలికా తల్పం, అమరుల ఆరనిదీపం, సువర్ణ సింహాసనం, నిర్జర మిధునం, అతివాస్తవిక అధివాస్తవిక స్వర్గం.

అతనికి–

అదే నిజం. అవే నిజం. వారే నిజం.

తనకి ఎంతో నిజమైన ఈ అబద్ధాల్ని చూడ్డానికే అతను యెంతో దూరం నుంచి శ్రమపడి వస్తోన్నది.

ఆ కిటికీ వెనక నిజం ఏమిటో, ఆ కిటికీ వెనక వాళ్లు నిజంగా ఎవరో

కథ
1953, అక్టోబరు

# జరీఅంచు తెల్లచీర



జరీ అంచు తెల్లచీర!

విశాలాక్షికి ఏడుపొస్తోంది.

గదిలో కుక్కి మంచంలో కూలడి చూస్తోంటే, ఎదట కొట్లో, హరికేన్ లాంతరు గుడ్డి వెలుగులో, ఫిజిక్స్ పాఠం చదివే అన్నయ్యా, పదమూడో ఎక్కం కంఠస్థం చేసే తమ్ముడూ కనిపిస్తూనే ఉన్నారు.

రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

వెనక వరండాలో నిద్దరపట్టక అమ్మ దొర్లుతున్నట్టుగా ఉంది. చిన్న తమ్ముడు మధ్య మధ్య ఏడుస్తున్నాడు. అగ్గిపెట్టెకోసం కాబోలు, నాన్న అటూ యిటూ తిరుగుతున్నాడు.

జరీ అంచు తెల్లచీర!

ఎప్పుడు కొనడం? ఎప్పుడు కట్టుకోడం?

ఏమో! ఎప్పుడో!

ఎప్పటినుంచో వస్తోన్న ఈ తీరని కోరిక ఎప్పుడు తీరుతుంది?

ఎప్పుడో! ఏమో!

ఎప్పుడో ఒకప్పుడు ఆ కోరిక తీరకపోదనే అనుకుంది.

ఆ కోరిక తీరాలనే అనుకొంది ఈనాటివరకూ.

కాని, ఈరోజు మాత్రం...

ఈ నాటికి పదేళ్ళ క్రితం....

ఆరేళ్ళ విశాలాక్షి సినిమాకి వెళ్ళింది.

అది ప్రప్రథమం, సినిమా హాల్లో అడుగుపెట్టడం.

విశాలాక్షి విశాలాక్షయింది.

ఆశ్చర్యం? ఆనందం? కాదు;

మైకం!

ఆట ఇంకా ఆరంభం కాలేదు.

ఆరేళ్ళ కళ్ళని హాలంతా గిరగిరతిప్పే విశాలాక్షికి, ఆఖరివరకు కుర్చీల్లోంచి అప్పుడే వస్తోన్న "ఆవిడ" కనిపించింది.

ఎవరావిడ?

"ఆవిడ!" అంతే.

హాలునిండా ఉండే దీపాల్లోకి దీపంలా వస్తోందావిడ.

నవయౌవన విలాసిని. సుమధుర హాసిని. శుభ్రజ్యోత్స్నాంబర ధారిణి. తెల్లటి మనిషి మెల్లగా నడుస్తూ వస్తోంటే, ఆమె కట్టుకున్న వెన్నెల్లాంటి తెల్లచీర తళతళా మెరుస్తోంది.

"అమ్మా! నా కలాంటి చీర కొనవే!"

"ఇష్ నోర్మూయ్!"

ఇంతలో దీపాలు ఆరడం తెరమీద బొమ్మలు కదలడం జరిగాయి.

కృష్ణుడి పాట, గోపికల నాట్యం.

తెల్లగా వెలిగేవి గోపికలు కట్టుకున్న తెల్ల చీరలు.

తళుక్ తళుక్ మనేవి ఆ చీరల జరీ అంచుల తళుకులు.

సినిమా అయాక, బైటకి వచ్చాక, మళ్ళీ

"అమ్మా! నాక్కొనవూ అలాంటి చీరా!?"

'ఇప్పట్నించీ కోరికలు బావున్నాయే తల్లీ! కొంటాంలే నీ పెళ్ళినాడు."

"ఎప్పుడే, ఎప్పుడే అమ్మా."

అమ్మా వాళ్ళూ నవ్వేరా?

నవ్వేరు.

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

ఆరేళ్ళ ఆడపిల్ల కోరిన కోరికే పదహారేళ్ళు ఎదిగిన ఆడపిల్ల కూడా కోరుతూ వచ్చింది.

ఈ కోరిక్కి వచ్చేయి పదేళ్ళు.

ఈ కోరికలన్నీ ఇలా పెరిగి పెద్దవయి చివరికి....

విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

జరీ అంచు తెల్లచీర!

"కొందాంలే" అనేసేవాడు నాయన.

నాన్న నోట్లో ఉండేది చుట్ట. అతని మనసులో ఉండేది పొగ. అతనికి ఉన్నది ఉద్యోగమా? అబ్బే! నౌఖిరీ! అతని చేతిలో లేనిది.

"ఉన్నప్పుడు ఎప్పుడో ఒకప్పుడు కొంటాలే"

ఎప్పుడో ఒకప్పుడు శుభముహూర్తం వస్తుందని విశాలాక్షి చూస్తూనే వచ్చింది.

ఎంతోకాలం నుంచి ఎన్నెన్నిటికోసమో ఈ విశాలాక్షి చూస్తోనే ఉంది.

ఈ విశాలాక్షి సజలనయనగా, వ్యర్థంగా.... విశాలాక్షికి ఏడుపు వస్తోంది.

జరీ అంచు తెల్లచీర!

"ఎన్ని ఖర్చులున్నాయో.... నువ్వెరగవా.... మీ నాయన చచ్చిచెడి ....ఆ నాలుగురాళ్ళూ.... ఏదో అదీ ఇదీ...జాగ్రత్తచేసి... తంటాలు పడకపోలేదు.... చూడా.... ఈఏడు నీ పెళ్ళి.... చెయ్యక తప్పదు కదా.... నీకు నచ్చిన చీరలు.... కొనకపోతే అలా అను."

అని ముగిస్తుంది తల్లి.

"ఎవ్వర్నీ ఏదీ అడగను"

అని ఎన్నోసార్లు నిశ్చయించుకొంది విశాలాక్షి.

ఫలానాది కావాలని ఎవర్నడిగినా వాళ్లకుండే బాధలన్నీ వెళ్ళబుచ్చక తప్పదు.

వాళ్ళలా చెపుతూంటే ఇంకా బాధగా ఉంటుంది విశాలాక్షికి.

కాని అడక్కుండా ఉండలేదు.

"మళ్ళీ ఏదైనా అడిగేవంటే చూడు. చమ్డా లెగరగొడతాను" అని – తిట్టి, కొట్టి, వళ్ళు హూనం చేసినా అంత బాధగా ఉండదు.

వాళ్ళలా చెపుతూంటే మాత్రం ఏడుపు వస్తుంది. కాని – ఏడుస్తే ఒకప్పుడు సంతృప్తిగా ఉంటుంది. అందుచేత–

ఏడ్చి సంతృప్తి చెందడానికి మళ్ళీమళ్ళీ అడుగుతూనే ఉండేది విశాలాక్షి.

ఒక్క జరీ అంచు తెల్లచీర!

విశాలాక్షికి ఏడుపే వస్తోంది.

అమ్మ చెప్పేమాటలు వింటే, చూస్తే –

పెళ్ళాడ్డం అనేటంత పనయితేనేగాని ఈ విశాలాక్షికి దొరకదొక్క జరీ అంచు తెల్లచీర!

– ఛీ! నేను పెళ్ళే చేసుకోను.

కాని –

కట్టుకుందికి గుడ్డముక్కా; రెండుపూట్లా ఇంత తిండీ; వీటికోసం ఆడపిల్ల పెళ్ళి చేసుకోక తప్పదు.

తప్పదా?

– తప్పకపోయినా సరే; ముష్టయినా ఎత్తి బతుకుతానుగాని పెళ్ళి మాత్రం చేసుకోను.

పెళ్ళాడకపోతే నువ్వు ముష్టే ఎత్తవలసి ఉంటుంది. నీకు డబ్బూ లేదు; చదువూ లేదు.

–హావు న్నిజం!!

ఈమెకి పాటయినా రాదు. ఈమె గుడ్డిదైనా కాదు. ఈమె శక్తయినా లేదు. మరి, లోకానికి దయన్నది లేదు.

విశాలాక్షికి ఏడుపువస్తోంది... కాని.... కాని...

– ఏమైనాసరే నేను పెళ్ళి చేసుకోను. చే...సు...కో...ను...

విశాలాక్షి పళ్ళు కొరికింది.

–అందులోనూ అందరూ అలాంటి వెధవలే!

తెల్లచీర జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా అమ్మ చెప్పే పెళ్ళిమాట జ్ఞప్తికి వస్తుంది. పెళ్లిమాట తలపుకి వచ్చినప్పుడు ఆ వెధవ తలపుకి రాకుండా ఉండదు.

వాడే కనకారావు. అన్నయ్యకి క్లాస్ మేటు.

వెధవ!

వాడా నీకొక ఫ్రెండని ఎంత చెప్పినా అన్నయ్య వినడు. కాఫీ ఇప్పించేదివాడు. సినిమాలకి తీసుకువెళ్ళేదివాడు.

ఇహ, వాడితో తిరగవద్దని ఎంత చెప్తే మాత్రం అన్నయ్య ఎందుకు వింటాడు?

కాని, విశాలాక్షి మాట విశాలాక్షి ఎలా యెవ్వరితో చెప్పగల్దు?

ఒకనాటి సాయంకాలం,

ఆరుగంటల మసక చీకట్లో,

అన్నయ్య ఇంటిదగ్గర లేనప్పుడు, నాన్న ఇంకా ఇంటికి రానప్పుడు, తమ్ముడు ఎక్కడికో వెళ్ళినప్పుడు, వంటగదిలో అమ్మ వండుతూన్నప్పుడు,

దొంగలా వచ్చిన కనకారావు,

"మీ అన్నయ్య ఉన్నాడా?" అని మెల్లిగా అడిగేడు.

"లేదు" అని గట్టిగా చెప్పింది విశాలాక్షి.

"అయ్యో! ఎలాగా! వాడి గదిలో నా పుస్తకా లుండిపోయాయే!"

"అన్నయ్యొచ్చాక తీసుకోవచ్చు."

నవ్వి తీరాలనే పట్టుదలతో కనకారావు నవ్వుతున్నాడు.

"వీడియెదట నవ్వకూడదు" అనే నిశ్చయానికి అతణ్ణి చూసిన మొదటిరోజునే వచ్చింది విశాలాక్షి.

చేసేదేమీలేక వాడు వెళ్ళిపోతుండగా,

అమ్మ వేసిన కేక!

"ఎవరే వారూ?"

"అన్నయ్య ఫ్రెండు"

అనే మాటల్లో ఎంత నిరసన చూపించాలో అంత నిరసన చూపించింది విశాలాక్షి.

"ఎవరు, కనకారావా! అయితే, చిన్నకొట్లో కూర్చోపెట్టు. అన్నయ్య ఇప్పుడే వస్తానన్నాడు."

వెళ్ళిపోయే శనిగ్రహం అంతటితో వక్రించి వెనక్కి వచ్చింది.

అమ్మకి తెలీదు. వట్టి సత్యకాలం!

సాటికులం వాడు. గొప్పవాడు. చదువు కొంటున్నాడు.

మా పిల్లని చేసుకుంటే బావుణ్ణు.

– అంతే అమ్మ ఉద్దేశం

మంచి చేసుకుంటే మంచినదనీ, అందుచేత మంచి చేసుకుందామనీ అమ్మ తాపత్రయం.

ఆ ఉద్దేశంతో, ఈ తాపత్రయంతో, నాన్నకి ఉంచిన కాఫీ పట్టుకువెళ్ళి వాడికి ఇమ్మంది.

– అయ్యయ్యో, అమ్మకేం తెలుసు?!

ఈ విశాలాక్షి కోపాన్ని ఆపలేదు. కన్నీటిని కట్టలేదు.

పిల్లని పెళ్లాడతాడేమోనని అమ్మ ఆశ.

అయినా –

– కనకారావునా నే పెళ్ళాడేది?!

అయినా –

కనకారావా పెళ్ళాడేది?

అలాంటి ఫకీరు వెధవలు పెళ్లాడరు.

ప్రేమలేఖలు రాస్తారు. తెరచాటున విజృంభిస్తారు.

అమ్మకి తెలీదు.

తల్చుకొంటూంటే విశాలాక్షి వళ్ళు దహించుకుపోతోంది.

చీకట్లో చెంగుపట్టుకున్న ఫకీరు వెధవ...

అయ్యా, ఈ ఎడమ భుజం ఎందుకు తెగ్గొట్టరు!!

హయ్యా, ఈ కుడిభాగం ఎందుకు ఛేదించరు!!

ఈ పెనుమంట ఏడుపుతో చల్లారదు.

విశాలాక్షిని ఏడవనీయ దీ పెనుమంట.

కాని, విశాలాక్షికి వస్తోంది ఏడుపు.

– నాకు పెళ్ళయినా అయింది కాదు. ఏ ఒక్కడైనా సాయపడ్డానికి నా కయిదుగురు భర్తలైనా ఉన్నారుకారు.

ఈ కీచకుడి పీచ మడంచడానికి ఎవడున్నాడు?

ఎవడూ లేడు?

ఎవరితో చెప్పుకోడం?

ఎవరితోనూ లేదు!

పాపాత్ములందరిమీదా ఒక్క పిడుగైనా పడదు.

పడ్డ అవమానం గురించి చెప్పుకునే శక్తయినా లేదు ఆడదానికి. చెప్పుకున్నా, శక్తిగల మగాడు కనిపించనైనా కనిపించడు.

ఆడపిల్లమీద,
తెరచాటున సాహసం, చీకట్లో పరాక్రమం
ప్రదర్శించిన కనకారావు
ఏమీ జరగనట్టే, ఏం జరిగినా ఫరవాలేదన్నట్టు,
బోర విరుచుకు నడుస్తూనే ఉన్నాడు.
వాడిచ్చిన కాఫీ తాగి, వాడు చూపించిన సినిమాలు చూస్తూనే ఉన్నాడు అన్నయ్య.
విశాలాక్షికి ఏడుపు వస్తోంది.
జరీ అంచు తెల్లచీర!!
ఫకీరు వెధవ కనకారావు!
– వాడి గురించి తల్చుకోను.
కాని, ఈ మంట చల్లారదు.
వాడికీ, తెల్లచీరకీ సంబంధం ఏముంది?
విశాలాక్షికి తెలీదు.
కాని, ఏదో సంబంధం వుంది.
అంతా బీరకాయ పీచు, ఒంటిగీత బొమ్మ.
విశాలాక్షి పరిస్థితికి, హీనస్థితికి, దౌర్భాగ్యానికి, కారణం? కారణం?
ఏవేవో కారణాలున్నాయి. అవేవీ విశాలాక్షికి తెలీవు.
కాని, ఆ కారణాలన్నింటికీ కనకారావునొక "సింబల్"గా చేసుకొంటున్నాట్లుగా కూడా విశాలాక్షికి తెలీదు.
తెల్లది, జరీ అంచుది, ఒక్క చీర ఉంటేనా?
కనకారావు రక్తంలో ముంచనా!
ఈ లోకాన్నే జయించనా!
ఒక్కటి, ఒక్కటేనండీ, ఒక్కటే!
విశాలాక్షి ఎన్నటికీ యేడవదు.
కాని, ఏడుపే వస్తోంది విశాలాక్షికి. ఆనాడు సినిమా హాల్లో కనిపించినావిడ ఎక్కడుంది? తెరమీద గోపికలు ఏమయేరు? జరీ అంచులన్నీ ఎక్కడ పడుకున్నాయ్? తెల్లచీరలన్నీ యేవీ యెక్కడ? విశాలాక్షికి ఎందుకీ ఆవేదన?
మంచం కుక్కిలోంచి లేదామనుకొన్న విశాలాక్షి లేవలేక అలానే కూలబడి కూర్చొంది.
అన్నా– తమ్ముడూ చదువుకొనే గదిలో హరికెన్ లాంతరు మినుకు మినుకు మంటోంది.
ఆ గుడ్డిదీపం దగ్గర వాళ్ళెలా చదువుతున్నారు? కట్టుకొందికి మంచి గుడ్డముక్క లేకుండా నేనెలా తిరగ్గలుగుతున్నాను? అమ్మకి ఏల నిద్దురపట్టదు? నాన్నకి అగ్గిపెట్టెలు ఎందుకు దొరకవు? ఈ మంచం ఎందుకింత కుక్కిగా ఉంది? ఇందులో నేనెందుకిలా ఉన్నాను?
విశాలాక్షికి ఏడుపు వస్తోంది.
ఒక్క తెల్లచీర – నేతదే– నూలుదే– కాని– జరీ అంచుది!
"పోనీ, మామూలు తెల్లచీర కొనుక్కోరాదటే"అనేది అమ్మ.
"నాకక్కర్లేదు. అంతగా కావాలని నేనన్నానా ఏం. యేవోచీరలున్నాయి కదా! కట్టుకుంటున్నాను. చాలు".
"నీకు ఊఁ అంటే పౌరుషం ఆఁ అంటే పౌరుషం కాని నే నెరగన్టే నీకు తెల్లచీర కావాలనుందనీ! పోనీ, తెల్లవాయిలు కొంటానూ! నీకు నచ్చిన అంచు అద్దకం చేయించుకొందువుగాని, యేం?"
"నాకు అ. క్క ర. లే. దు."
"అయితే, పోనీవే? నీ తత్వం ఏమిటో నా కర్థంకాదు"
ఏవో రంగుచీరలు కట్టుకొంటూనే ఉంది విశాలాక్షి.
కాని –
తెల్లదే కట్టుకున్నప్పుడు జరీ అంచుదే కట్టుకోవాలి!
అదొక తియ్యటి కోరిక.
నెరవేరదా?
పోనీ!
అంతేకాని–
కోరాసైను! తెల్లవాయిలు! అద్దకపుటంచు!
యెప్పటికీ పెళ్ళికాక మూడోపెళ్ళి వాణ్ణి చేసుకున్నట్టు!
అలా–
మూడో పెళ్ళివాడు తలపులోకి రావడంచేనే ఆ సైనూ, ఆ వాయిలూ అక్కర్లేదంటుంది విశాలాక్షి.
అర్థంకాదు, ఎవ్వరికీ అర్థం కాదు.
తలబాదుకున్నా, ఎవ్వరికీ అర్థం కాదు.
మంచంకోడుకి తలవేసి కొట్టుకోవాలనీ, గోడకివేసి తల బద్దలు చేసుకోవాలనీ, మనుష్యులందర్నీ చంపాలనీ, లోకానికి నిప్పుపెట్టాలనీ ఉంది విశాలాక్షికి.
ఏడవకుండా ఉండాలనుంది విశాలాక్షికి.
కాని, ఈరోజు సాయంకాలం విషయం తలపులోకి వస్తోంటే యేడవకుండా ఉండలేదు విశాలాక్షి.
సాయంకాలం నాన్న –
"అమ్మా! బజారుకి వెళ్దాం రావే"
"ఎందుకు నాయనా?"
"తెల్లచీర కావాలంటున్నావు కాదుటే!"
"నాయనా"
"బయల్దేరవే"
"ఊరకే అనేదాన్ని నాయనా! నాకక్కర్లేదు."
"పదవే, వెర్రిదానా, మళ్ళీ చేతిలో చిల్లిగవ్వుండదు"
అని అతను అన్నప్పుడు విశాలాక్షికి ఏడుపే వచ్చింది. ఎప్పుడో ఎక్కడో విన్న విషాదగాథలన్నీ తలపులోకి వచ్చేయి. స్మృతి పథాన్నుంచి జారిపోయిన విషాద దృశ్యాలన్నీ దారికి అడ్డుగా నిల్చేయి.
ఆస్పత్రి ఎదట, చెట్టుకింద, ఒకదినం మధ్యాహ్నం చూసిన పడుచుపిల్ల శవం, పెత్తల్లికూతురు నూతిలో పడిందని ఒకనాటి సాయంకాలం దీపాలు పెట్టేవేళ వార్త తీసుకువచ్చిన నలిగిన ఉత్తరం, మేడమీంచి పడిన మేస్త్రీకోసం ఏడిచన ఎదటింటి మనిషి, కడుపులో బల్లతో చనిపోయిన పక్కంటిపిల్లడు, అనకాపల్లి నుంచి రాత్రి ట్రెయిన్‌లో వస్తూ కిటికీలోంచి చూసిన చీకటి కొండలు, మసురుపట్టిన రోజులు, దీపాల్లేని రాత్రుళ్ళు, ఇటువంటివన్నీ ఎందుకు జ్ఞప్తికి రావాలి?!
ఈ రోజు సాయంకాలం –
గోడవైపు తిరిగి కంటినీరు పెట్టడానికి కారణం అవన్నీ జ్ఞప్తికి రావడమే కాదు.
ఇంకోటికూడా ఉంది.
అది ఉండబట్టే అవన్నీ స్ఫురణకు వచ్చేయి.
అది –
రక్తం!
బజారుకి వెళ్దామన్న మనిషి బజార్లో యివ్వబోయేది డబ్బు కాదు; నెత్తురు.
అతని ముఖం చూస్తేనే తెలుస్తుందా విషయం.
రక్తం ధారపోస్తేనేగాని తీరని కోరికలు నా కక్కర్లేదు.
విశాలాక్షికి ఏడుపొస్తోంది.
"ఉత్తినే అనేదాన్ని. నిజం నాకలాంటి చీర అక్కర్లేదు" అని ఏడ్చిచెప్పినా నమ్మరెవ్వరూ.
"పద పద! వెల్తురుండగానే వెళ్ళడం మంచిది."
కొత్తచీర కొనుక్కుందికి, ఉతికిన చీర కట్టుకొని బయల్దేరిన విశాలాక్షి ఏడ్చిందని ఎవరికైనా తెలుసా?!
ఇద్దరూ బయల్దేరేరు. వెళ్లేరు.
కూతుర్ని వెంటబెట్టుకొని అతను బజారుకు వెళ్ళడం చాలాకాలాని కది

మొదటిసారి.
రాత్రివేళ దీపం వెలుగులో తెలుపు పక్కన పెడితేనేగాని పసుపురంగేదో సరిగా తెలియనట్టు, ఇంట్లో వుండే లేమి నలుగురు మధ్యకీ వెళ్తేనేగాని సరిగా కనిపించదు.
విశాలాక్షి కళ్ళంట నీళ్ళు తిరిగాయి.
ఇంట్లో ఎంతో గంభీరుడిగా కనిపించే ఆమె తండ్రి వీధిలో ఎందుకంత దీనుళ్ళా కనిపిస్తున్నాడో ఆమెకి అర్థం కాలేదు.
ఇంత నీరసంగా ఎందుకున్నాడు? ఇంత దారిద్ర్యం ఎక్కణ్ణించి ముంచుకొచ్చింది? జీవం ఉండీ లేనట్టుగా యిలా ఎలా నడవగలుగుతున్నాడు?
నడిరోడ్డు కాబట్టి కన్నీరైనా కార్చకుండా ఏడవ్వలసి వచ్చింది విశాలాక్షి.
"నాకీ జరీ అంచు తెల్లచీర అక్కర్లేదంటే యెందుకు నమ్మరు వీళ్ళంతా."
నా క్కావాలి; కాని నిజంగా నా కక్కర్లేదు.
అతను నడుస్తున్నాడు. కొంచెం వెనగ్గా విశాలాక్షి.
అతని దగ్గర ఉన్నది పన్నెండు కాబోలు, అంతకంటె యెక్కువ మాత్రంకాదు.
ఏ దుకాణంలో అడిగినా, కావలసిన చీర కనీసపు ఖరీదు ఇరవై.
షాపులు ఎక్కేరు. షాపులు దిగేరు.
నడిరోడ్డుమీదనో, లేక యే దుకాణంలోనో, ఏక్షణాన ఉప్పెనగా యేడుపు వస్తుందోననే భయంతో అగ్నిపర్వతాన్ని అణచుకొని, గోదావరి వరదని ఆపుకొని నడుస్తోంది విశాలాక్షి.
ఈ సాయంకాలం గురించి తల్చుకొంటూంటే చచ్చిపోవాలనిపిస్తోంది విశాలాక్షికి. వళ్లు మండిపోతోంది విశాలాక్షికి.
అందులోనూ ఆఖరి షాపువాడు!
మరొక కనకారావు!
లోకంలో కనకారావుల్ని ఇట్టే పసికట్టగలదు విశాలాక్షి. వాడో కనకారావని వాడి ముఖం చూస్తేనే తెలుస్తోంది.
కాని, వాడెందుకలా ఎంతో కాలం నుంచీ ధుమధుమ లాడుతున్నట్లుగా ఉన్నాడు?
తెల్లదొరల పాలన పోయిందనీ, షాపుకి సీమదొరలు రావడంలేదనీ వాడికి కోపంగా ఉన్నదని విశాలాక్షికేం తెలుసు?!
అతనికేగాని శాసనాధికారం ఉంటే సీమదొరలూ, ఐ.సి.యస్ ఆఫీసర్లూ, మహారాజులూ తప్పించి వేరెవ్వరూ తన షాపుకి రావడానికి వీల్లేదని శాసించగలిగినవాడు ఆ షాపువాడు.
ఆ సంగతి విశాలాక్షికి తెలీదు. ఆమె తండ్రికీ తెలీదు. కాని, ఆ షాపు ముఖం చూస్తేనే వెళ్ళాలనిపించడ లేదు.
"ఒద్దు నాన్నా! అది గొప్ప షాపూ."
"ఇంతదూరం వచ్చేంకదా! పోయి చూద్దాం రా."
అమాంతంగా కాళ్లువచ్చి నడుచుకొచ్చిన చెత్త డబ్బాని చూసినట్టుగా వాళ్ళంతా తన తండ్రిని చూశారని విశాలాక్షికి తెలుసు.
విశాలాక్షిని వాళ్ళంతా యే దృష్టితో చూశారో కూడా విశాలాక్షికి తెలుసు.
విశాలాక్షికి అవమానం భరించే శక్తిలేదు.
శక్తిలేకపోయినా భరించి తీరాలి.
విశాలాక్షి దహించుకుపోతోంది.
"సిల్కుచీరలు కావాలా?" అని అడిగేడు షాపువాడు.
ఆ మాటల్లో వెటకారం లేదన్న వాళ్లు గుడ్లు పీకేస్తాను.
అందుకు, విశాలాక్షి తండ్రి:
"అబ్బే..." అని ఆరంభించేడు.
ఆ "అబ్బే"ని ని ఉచ్చరించడంలో ఎందుకంత దౌర్భాగ్యాన్ని ధ్వనించడం?
అందులోనే ఎందుకంత సిగ్గు? ఎందుకంత భయం?
"అబ్బే... నేత చీరలు... తెల్లవి.... కాస్త జరీ... చూపిస్తే చాలు.."
వద్దు వద్దు. పోదాం.
అని ఎలా చెప్పడం?
సూదిమేకులమీద, ముళ్ళ డొంకల మధ్య నిల్చున్నట్టుగా నిల్చొంది.
ఇంతలో, వాడు చీరలమేటిలోంచి పైకితీసేడు.
జరీ! జరీ! జరీ అంచు తెల్లచీర.
తాచుపామును చూసినట్టుగా జడుసుకొంది విశాలాక్షి.
దూరంగా, దూరంగా, ఈ విషాన్ని దూరంగా తీసేయండి.
"ఎంతండీ?"
"ఇరవైరెండు"
అతను జంకి జంకి, భయపడి భయపడి,
"కొంచెం... కొంచెం అయినా... తగ్గదంటారా? అనేసరికి
"ఇదేం శుక్రవారం సంతకాదు, బేరాలాడ్డానికి" అనే మాటల్తో కొట్టేడు వాడు.
దెబ్బ తగలగానే కదలడానికి భయపడ్డ నాన్న;
"పోనీ.... మరో రకం.... కొంచెం తక్కువ ఖరీదువి..." అనే లోపునే వాడు,
"లేవండీ బాబుగారూ, లేవు" అని అవమానకరమైన అతి మర్యాదతో అన్నాడు.
షాపంతా అతి నిశ్శబ్దం.
వాడు వెటకారంగా నవ్వనైనా నవ్వలేదు.
కనకారావులు నవ్వకుండానే అవమానించగలరు.
ఈ కనకారావుల నెత్తురు చూద్దం ఎప్పుడు?!
అందులో నా తెల్లచీర తడపడం ఎప్పుడు?!
క్రోధజ్వాల విశాలాక్షిని దహించేస్తోంది.
షాపు బైట –
దెబ్బతిన్న గొడ్డులా కనిపించే ఈ వృద్ధుడెవ్వరు?
"నే వద్దంటే ఎందుకు విన్నావుకాదు నాయనా."
"అంత ఖరీదు ఉంటాయనుకోలేదే"
నెత్తురే ఖరీదుగా ఇచ్చినా దొరకని వస్తువులు!
దహించుకుపోయే విశాలాక్షిని ముంచేయడానికి వస్తోంది, ఉప్పెన.
ఒక్క జరీ అంచు తెల్లచీర!
కుక్కి మంచంలో కూలబడి కూర్చొన్న విశాలాక్షి కొట్టుకుపోతూ చూస్తోంది.
ఇంట్లో,
కష్టపడి కష్టపడి వెలిగే "తుపాను దీపం"; ఫిజిక్స్ పుస్తకం చిక్కుల్లో ఇరుక్కున్న అన్నయ్య; పదమూడో ఎక్కం గతకల్లో పడిలేచే తమ్ముడు; నిద్దర పట్టని తల్లి; అగ్గిదొరకని తండ్రి; ఏడవకుండా ఉండని చిన్న తమ్ముడు....
విశాలాక్షికి ఏడుపు వస్తోంది.
అన్నయ్యకి ఫిజిక్స్ పాఠం అర్థం కాదు. తమ్ముడికి పదమూడో ఎక్కం చస్తేరాదు. అమ్మకి నిద్దర పట్టడం అనేది ఉండదు. నాన్న అగ్గికోసం వెతుకుతూనే ఉంటాడు. చిన్న తమ్ముడు ఏడవక తప్పదు. ఈ వెలగలేని దీపం ఎంతోసేపు వెలగదు.
– నే నేడవను,
అనుకొన్న విశాలాక్షికి మరింక ఆగకుండా ఏడుపు వస్తోంది.
కుక్కి మంచంలో కూలబడి కూర్చొన్న ఈ పదహారేళ్ళ ఆడపిల్ల ఈ విశాలాక్షి ఏకధారగా, వరద వరదగా ఏడుస్తోంది.
ఇది మెరుపులేని మబ్బు. ఇది తెరిపిలేని ముసురు. ఇది ఎంతకీ తగ్గని ఎండ. ఇది ఎప్పటికీ తెల్లవారని చీకటిరాత్రి. ఇది గ్రీష్మం. ఇది దగ్ధంచేసే దావానలం. ఇది రెక్కల్ని రాల్చేసే నైరాశ్యం –
ఒక్కటి! ఒక్కటే సుమండీ! ఒక్క
జ రీ అం చు తె ల్ల చీ ర!

*ఆంధ్రపత్రిక (వారపత్రిక) 21-10-1953.*

కథ
1954, ఏప్రిల్

# ఇద్దరు పిల్లలు



**చం**ద్రుణ్ణి కొనుక్కోనక్కర్లేదు. చుక్కల్నికూడా కొనుక్కోనక్కర్లేదు.

అందుచేతనే చేతిని ఎత్తుకొన్న కొడుక్కి వాటిని చూపించి ఊరుకోబెడుతోంది ఆవిడ, సాయంకాలం ఆరున్నర గంటల పొద్దున్న, ఇంటిముంగిట్లో అంటే వీధిలో నిల్చొని.

ఉత్తర దక్షిణాలకి పోయే సందు 'పొడవుగా' ఉంది. అట్టే వెడల్పుగా మాత్రం లేదు. మ్యున్సిపల్ దీపాలు పేరుకి తగ్గట్టుగా వెలుగుతున్నాయి. తొట్టిగా ఉండే పెంకుటిళ్ళమీంచీ, తాటాకుల కప్పుల మీంచీ, మురికి వీధిలోంచీ చలిగాలి మంద మందంగా వీస్తోంది. నడిరోడ్డుకి సూటిగా మీదకి నిల్చిన చంద్రుడు వంకరగా ఒరిగి చిరుమబ్బు నొకదాన్ని విదుల్చుకొని బైటపడ్డాడు.

చలికి పైట దగ్గరగా కప్పుకొని, కుడిచేత్తో ఆకాశంవైపు చూపిస్తూ –

"అదుగో చందమామ! చూడమ్మా, చూడు" అంది ఆవిడ.

పిల్లడు తలెత్తి చూసి ఏడుపు ఆపేడు.

ఆ అబ్బాయి ఏడాదికంటె హెచ్చు వయసువాళ్ళా లేదు. మొక్కుబడి ఏదైనా ఉందేమో, జుట్టంతా అట్టలు కట్టి ఉంది. వంటిమీద బట్టలూ, వంట్లో జవసత్వాలూ లేవు. కొన ప్రాణాలు కళ్ళల్లో ఉన్నాయి.

ఆ పిల్లడికి "నిజంగా మూడేళ్ళున్నా" యంటే ఆ మాట నిజమేకాని నమ్మడానికి వీలుగా లేదు.

కొందరు జీవచ్ఛవాల్లా ఉంటారు. ఆ పిల్లాడు అలానే ఉన్నాడు.

ఆ తల్లికూడా అలానే ఉంది.

"అవిగో చుక్కలు! చూసేవా ఎలా మెరుస్తున్నాయో" అంది ఆవిడ, చుక్కల్ని కూడా చూపిస్తూ.

చందమామని చేరదీసుకొందామనీ, చుక్కలకి చేరువగా చేరిపోదామనీ ఉండేది ఆవిడకి.

అది ఒకనాటి విషయం.

అదంతా గడిచిన దినాల సంగతి.

ఇప్పుడావిడ చందమామే కావాలందా? చుక్కల్ని తీసుకొచ్చి ఇస్తేనేగాని వీల్లేదందా?

అదేం లేదు.

చంద్రుడెలానూ దగ్గరగా రాడనీ, చుక్కలకి దగ్గరగా వెళ్ళడం ఎలానూ ఉండదనీ ఆవిడకి స్పష్టంగా తెలుసు.

తల ఎత్తి ఆకాశంలోకి చూసి నవ్విన పిల్లడు తలదించి తిరిగి ఏడవక తప్పదని కూడా ఆవిడకి తెలుసు.

ఆ కుర్రవాడు అదేరీతిగా చేసేడు మరో క్షణానికి.

ఏడుస్తూ యేదో మాటమాత్రం అస్పష్టంగా హీనంగా అంటున్నాడు.

"ఉండ్రా చచ్చినాడా! అన్నయ్య వెళ్ళి రావాలా? ఊరికే యేడుస్తే ఒస్తదా?" అని ఆవిడ కేకలు వేసింది.

ఆ "వచ్చేది" యేడుస్తే వస్తుందో రాదో ఆ కుర్రవాడికి తెలీదు. ఆ కుర్రవాడ్ని ఎలా సముదాయించటమో ఆవిడకి తెలీదు. తెలిసినా సముదాయించే ఓపిక లేదు. అందుచేత వాణ్నొక్క మొత్తు మొత్తి ఇంట్లోకి తీసుకుపోయింది.

సరీగ్గా అదే సమయంలో ఆ తల్లి కొడుకే, ఏడేళ్ళవాడు – నల్ల గోపాలం ఆ ఇంటికి కొంత దక్షిణంగా ఆ వీధిలోనే అమ్మవారి గుడిదగ్గర, వేపచెట్టుకింద నిల్చొని, ఆఖరిసారి అడిగినట్టుగా "అయితే, ఇవ్వవుకదరా" అని అడిగేడు.

గోపాలానికి ఎదురుగా నిల్చున్న కుర్రవాడు, అదే వయసువాడు – ఎర్రసుబ్బుడు – పోయే ప్రాణాల్ని బిగించి పట్టుకున్నట్టుగా, చేతులు బిగించి గుండెలకి హత్తుకున్నాడు "బొంబాయి బస్సు"ని.

వేపచెట్టుకి యెదురుగా టెయిలర్ దుకాణంలోని లాంతరు వెలుగు వేపచెట్టు నీడలోనికి రాడానికి జంకుతోంది. వేపచెట్టు ఆకులు చలికాలానికి పల్చపడ్డాయేకాని చంద్రుణ్ణి మాత్రం అటకాయించేస్తున్నాయి. చెట్టు మొదల్లో బొమ్మవంటి గుళ్ళో నిశ్చలంగా నిల్చొన్న అమ్మవారి ముందు వెలిగే నూనెదీపపు వెలుగు ఆ ఇద్దరి పిల్లలకీ అందడం లేదు. గోపాలం నల్లటి నలుపనీ, కళ్లు మాత్రం పెద్దవనీ,

నోరు చిన్నదనీ, ముక్కు ఎత్తనీ ఆ చీకట్లో చూస్తే తెలీదు. లాంతరు వెలుగులోకి లాక్కొచ్చి చూస్తే యెర్రసుబ్బడు రాగిచెంబు రంగులో ఉంటాడని, ముఖం సున్నాలా ఉంటుందనీ, కళ్లు చిన్నవనీ, నోరు పెద్దదనీ, ముక్కు ఎర్ర జీడిపండులా ఉంటుందనీ తెలుస్తుంది. బాగా యెత్తుగా ఉన్న అంతటి చెట్టుకింద వాళ్ళిద్దరూ చాలా పొట్టిగా, పల్చగా, చిన్నగా, చిన్న కొయ్యబొమ్మల్లా మాత్రం కనిపిస్తున్నారు.

సందు ఆట్టే సందడిగా లేదు. ఉండీ ఉడిగీ ఒకడూ అరా చొప్పున మనుష్యులు నిశ్శబ్దంగా నడుచుకొని పోతున్నారు. పిల్లల్ని యెవ్వరూ గమనించినట్టుగా లేదు. గమనించినా వాళ్ళిద్దరి మధ్యా ఘర్షణ జరుగుతోందని తెలిసికొన్నట్టుగా లేదు. తలకి ముసుగువేసుకొని, దగ్గుతూ దగ్గుతూ వచ్చిన ఓ ముసలాయన మాత్రం వాళ్ళకి దగ్గరగా వచ్చి ఆగి, పరీక్షగా "ఎవరబ్బాయిల్నాయినా? సీకటడిపోయింది. పొండి యిళ్ళకిపొండి" అన్నాడు. వాళ్ళామాటలు విన్నట్టుగా లేదు. మరో మనిషి వచ్చేడని చూసినట్టుగానే లేదు. ముసలాయన దగ్గుకొంటూ వెళ్ళి చంకనున్న గోనెవిప్పి అమ్మవారి గుడిపక్క చప్టామీద పరుచుకొని కీళ్లు నొవ్వకుండా నెమ్మదిగా జాగ్రత్తగా పడుకొన్నాడు. బొంబాయి బస్సులనేవి ఉంటాయని ముసలాయనికి తెలీదు.



చంద్రుణ్ణీ చుక్కల్నీ కొనుక్కోనక్కరలేదు. బొంబాయి బస్సుల్ని మాత్రం కొనుక్కోవాలి.

అయితే ఆ బొంబాయి బస్సు ఎర్రసుబ్బడికి కొనకుండానే వచ్చింది. మొన్నీ మధ్య సుబ్బడి బావ – అప్ప పెనిమిటి – బొంబాయి నుండి బండీ దిగేడు. దిగి ఇంటో అడుగుపెడుతూనే, పెట్టె తెరిచి పైకితీసి బహూకరించేడు. మరదలికొక –సాటిన్ ఫ్రాకూ, బావమరిదికొక 'బాంబాయి బస్సూ'ను.

బొమ్మనీ, బొమ్మని తెచ్చిన బావనీ, బావని పెళ్ళాడిన అప్పనీ చూసుకొని బ్రహ్మానంద భరితుడైన ఎర్రసుబ్బడు యింటో అటూ ఇటూ ఎగిరెగిరి తరువాత ఒక్క దూకు దూకేడు నల్లగోపాలం ఇంటికి.

ఎదటింటి ఎండు వెంకడుగాడు, పక్కింటిదుక్క బుజ్జాయిగాడు, వెనకింటి దొంగబాబిగాడు, నూతిపక్కింట్లో నూనె జిడ్డుగాడు, జామి చెట్టింట్లో జామకాల సీత – వీళ్లంతా సుబ్బడి స్నేహితులే. కాని ఆ బొమ్మని వాళ్ళెవరికీ చూపించకుండా, సూటిగా, రామబాణంలా ఆ నల్లగోపాలం ఇంటికే ఎర్రసుబ్బడు ముందుగా పరిగెత్తగానికి కారణం?

వాళ్ళిద్దరూ ప్రాణస్నేహితులని ఆ వీధిలో అందరికీ తెలుసు. సుబ్బడి తండ్రికీ, గోపాలం తండ్రికీ ఒకే "మర"లో నౌఖిరీ. ఆ తండ్రులిద్దరూ మర్లోకీ తాగడానికీ కూడా కలిసే వెళ్తుంటారు. వాళ్ళ ఇళ్లు కొంచెం దూరదూరంగా ఉన్నా ఒకేవీధిలో ఉన్నాయి. వారి భార్యలు అప్పుసప్పులకి ఒకరిళ్ళ కొకకు వెళ్ళినప్పుడు ఒకరిదెబ్బ లొకరికి చూపించుకోడం వారికి మామూలు.

గోపాలానిదీ సుబ్బడిదీ ఇంచుమించు ఒకే వయసు. వాళ్ళిద్దరిదీ ఒకే స్కూల్లో ఒకే క్లాసు.క్లాసుకి ఎప్పుడూ ఆలస్యంగా వెళ్లేది వాళ్ళిద్దరే. ఒకటో ఎక్కం, రెండో ఎక్కం, పదో ఎక్కం తప్పించి మరే ఒక్క ఎక్కం కూడా రానివాళ్ళు ఆ క్లాసుకి వాళ్లిద్దరే.

పెద్దలైనా, పిన్నలైనా ఇటువంటి పరిస్థితుల్లో స్నేహితులవక తప్పరు.

కాని, ఓ రామయ్యగారికి జామిచెట్టే లేకపోయినట్లయితే వాళ్ళిద్దరూ ప్రాణ స్నేహితులవలక పోయేవారేమో.

స్కూలుకి దగ్గర్లో రామయ్యగారి ఇల్లుంది. ఇంటిపక్క రామయ్యగారి జామి చెట్టుంది. జామిచెట్టుమీద రామయ్యగారి పంచప్రాణాలూ ఉంటాయి.

కలకల్లాడుతూ కల్పవృక్షంలా కనిపించే జామిచెట్టునిండా నవనవలాడుతూ పళ్ళు యెన్నో పళ్ళు ఉన్నప్పటికీ, బడిపిల్లలకి అదొక వెల్‌కమ్ అడ్రస్‌లా ఉన్నప్పటికీ, ఏ ఒక్క బడిపిల్లడూ కూడా ఆ పళ్ళని చూసి ఆనందించడం తప్ప తిని ఆనందించపోడానికి రెండు కారణాలున్నాయి.

ఒకటి: రామయ్యగారి తోటమాలీ యమకింకరుళ్ళా ఉండడం.

రెండు: రామయ్యగారు కాలయముళ్ళా ఉండడం.

నల్లగోపాలం మాత్రం చూసిచూసి ఓ రోజున ధైర్యం చేసేసేడు.

దిగవని ఎర్రసుబ్బడు రాలేపళ్ళని జోరుజోరుగా ఏరుతున్నాడు. పైనుంచి నల్లగోపాలం పళ్ళని తెంపి పారేస్తున్నాడు. ఇద్దరూకూడా యముడూ, కింకరుడూ ఇంట్లోంచి వెళ్లడమే చూసేరు కాని రావడం గమనించలేదు. వాళ్ళు మాత్రం వస్తూనే చూసింది వీళ్ళనే. వస్తూనే చెరొకణ్ణీ పట్టుకొని చావగొట్టి చెవులు మూసేరు. ఆ దినం రామయ్యగారికీ రావణాసురుడికీ తేడా తొమ్మిది తలల్లో మాత్రమే.

కాలయముడు; కల్పవృక్షం; చావు దెబ్బలు.

నల్లగోపాలం, ఎర్రసుబ్బడూ ప్రాణస్నేహితులవడానికి అవీ కారణాలు. అవి మాత్రం సిమెంటు కాంక్రీటువంటి కారణాలు.

ఈ స్నేహితులకి –

బటానీలు, పకోడీలు, ఉసిరికాయలు, రేగుపళ్లు, వేరుశెనగలు, గాలిపడగలు, పలకపుల్లలు, రబ్బర్లు, తెల్లకాయితాలు, బొంగరాలు, గొట్టికాయలు వగైరాలు – అన్నీ కూడా వారి సమిష్టి ఆస్తులు. అవి ఒకరికి ఉన్నట్లయితే రెండో వారిక్కూడా ఉన్నట్లే లెక్క.

బొమ్మ బస్సుని చూసినప్పుడుకూడా సుబ్బడెంత సంతోషించేడో గోపాలం అంతగానూ సంతోషించేడు.

చాలా చిన్నది బొంబాయి బస్సు. ఎర్రటి రంగుతో మెరుస్తూంది. అంత చిన్న బొమ్మలోనూ రెండు అంతస్తులు కనిపించేలా తయారుచేసేరు. డ్రైవరు టిన్ డ్రైవరు. కిటికీల దగ్గర ప్రయాణీకులూ, గుమ్మం దగ్గర కండక్టరూ మాత్రం రంగు రేకుమీద రంగు బొమ్మలు. "కీ" ఇస్తే బస్సు పరుగెడుతుంది.

"బలే బలే బలేగుందిరా" అన్నాడు నల్లగోపాలం.

కాని సుబ్బడి వ్యవహారం బలేగా ఉందా?

దీనికి "కీ" ఇలా యివ్వాలి, కుడివైపుకి తిప్పాలి. వెనక చక్రాలు గిర్‌గిర్‌మని తిరక్కుండా యిలా పట్టుకోవాలి,

అని ఆ బొమ్మకి "కీ" ఎలా ఇవ్వడమో చూపించేడు సుబ్బడు.

ఇలా ఒదలాలి.

బస్సుని ఒదిలేడు.

జరజర శబ్దంచేస్తూ వెళ్ళి గోడని గుద్దేసి ఆగిపోయింది బస్సు.

"అద్దేదీ లేకపోతే చాల్దూరం వెళుతుంది తెల్సా!" అన్నాడు సుబ్బడు.

బస్సుని గోడకి ఇవతలవైపుకి మళ్ళీ తిప్పి వదిలేడు.

జరజరా మళ్లీ పరిగెత్తింది బస్సు. చివరికి ఆగింది.

దాన్ని చేతిలోకి తీసుకొని చెపుతున్నాడు సుబ్బడు.

"చూసేవా, ముందు కూర్చున్నాడు డ్రైవరూ. మా బావ అలాగే కూర్చుంటాడు. మరో తమాషారా, గోపాలం! ఇది మేడబస్సు. 'మనూళ్ళో యిటువంటి దేదీ చూపించు చూదాం!' బొంబాయిలో అన్నీ యిలాటి బస్సులే. బొంబాయి మా బావతో నేనూ వెళ్తాన్ తెల్సా!"

ఆ మాటలు చెప్పడంలో, చెపుతూన్నప్పుడు ఆ కళ్ళు తిప్పడంలో, ఆ బొమ్మని చేత్తో గట్టిగా పట్టుకోడంలో, 'కీ' ఇచ్చి దాన్ని పరిగెత్తించినప్పుడు గోపాలం ఎక్కడ లాక్కుంటాడో అని తనే ముందు పరిగెత్తి దాన్ని తీసి గుండెలకి అదుముకోవడంలో మచ్చు కొక్కసారైనా దాని గోపాలం చేతికి యివ్వకపోవడంలో –

సుబ్బడి ఉత్సాహమే కాకుండా, "ఇది నాది. దీన్ని నేనే వాడాలి" అనే భావం కూడా వ్యక్తమవుతోంది. కొద్దిసేపట్లో గోపాలానిక్కూడా అంతా స్పష్టమయింది.

"ఈ బొమ్మ వీడు నాకివ్వడు–"

అని చాలా ఖచ్చితంగా, రెండు రెళ్ళు నాలుగులాగ, సూర్యుడు ఉదయించి అస్తమించుట్లాగ తెలిసింది గోపాలానికి.

"నేనోసారి 'కీ' ఇస్తానిలా ఇవ్వరా" అని అడిగేసేడు.

అప్పుడు సుబ్బడు బస్సుకి 'కీ' యివ్వబోతున్నాడు. ఇవ్వబోతూ ఆగేడు.

ఇస్తాడా ఇవ్వడా? ఇవ్వడా ఇస్తాడా? ఇస్తాడా ఇవ్వడా?....

"కీ" ఇవ్వడం మొదలుపెట్టేడు సుబ్బడు.

"మా బావా... ('కీ' తిప్పేడు)... మరీ... (మళ్ళీ తిప్పేడు)...మా బావవొచ్చి మరీ – (మరోసారి తిప్పేడు).... కోప్పడతాడ్రా..."

అని యింకా ఏదో నసిగేడు సుబ్బడు, కరకరమని 'కీ' ఇచ్చేస్తూ సాకులు చెపుతున్నాడు సుబ్బడు!

గోపాలానికి అసహ్యం వేసింది.

"పోన్లేరా ఒద్దులే" అనేశాడు.

గోపాలం ఉత్సాహం అంతా చచ్చిందంటే అర్థం వుంది. కాని సుబ్బడి హుషారంతా కూడా ఎందుకు సన్నగిల్లింది? ఏదో తప్పుచేసినట్టు ఎందుకు సిగ్గేసింది? మరో అయిదు నిమిషాలైనా ఉండలేకపోయేడు అక్కడ. తిరిగి యింటికి మెల్లిగా బయల్దేరేడు.

బయల్దేరబోయేడు.

ఇంతలో యెదురుగా గోపాలం తమ్ముణ్ణి యెత్తుకొని గోపాలం తల్లి వచ్చింది.

గోపాలం తమ్ముడు అందరికీ తమ్ముడే.

బొంబాయి బస్సుని చూడగానే తమ్ముడు –నిజంగా చాలా కాలానికి – నవ్వేడు.

"ఏవిరా సుబ్బడూ, ఏమిట్రా ఆ చేతిలోదీ?" అని అడిగింది 'తమ్ముడి' తల్లి.

ఎడంగా నిల్చొన్న నల్లగోపాలం నిశ్శబ్దంగా నిల్చొని తీక్షణంగా చూస్తున్నాడు.

"బస్సు! బొంబాయి బస్సు!" అన్నాడు సుబ్బడు, తలవంచుకొని చేతిలో బొమ్మవైపు చూస్తూ.

బావ రావడం, బొమ్మ తేవడం మొదలైన విషయాలన్నీ నెమ్మదిగా ఒకటీ ఒకటీ తెలుసుకొంది గోపాలం తల్లి.

తమ్ముడు ఈ లోపు "బచ్చు బచ్చు" అంటూ చెయ్యి జాస్తూనే ఉన్నాడు.

చూస్తున్నాడు గోపాలం. గోపాలం చూస్తున్నాడు.

తనకయితే ఇవ్వలేదు. తమ్ముడికైనా ఇస్తాడా ఇవ్వడా?

తమ్ముడికేగాని ఇవ్వకపోతే సుబ్బడితో ఆ క్షణంలోనే జుట్టువిప్పేసి తీరుతాడు గోపాలం.

సుబ్బడు కూడా చూస్తున్నాడు. వేగిరం ఉడాయించేద్దామని చూస్తున్నాడు కాని కాలు కదలడం లేదు. చప్పుడు ఆమడ దూరానికి వినబడేలా గుండెలు కొట్లాడుతున్నాయి.

తమ్ముడు "బచ్చు బచ్చు" అని అంటూనే ఉన్నాడు.

ఎత్తుకున్న పిల్లణ్ణి నేలని కూర్చోబెడుతూ "ఏదీ ఆ బొమ్మ వీడికోసారి ఇద్దూ" అంది గోపాలం వాళ్ళ అమ్మ.

అప్పటిమట్టుకు బొమ్మని ఇవ్వక తప్పిందికాదు. ఆవిడక్కూడా ఏదో సాకు చెప్పే సాహసం లేకపోయింది సుబ్బడికి.

కాని మర్నాడు మాత్రం 'గోపాలం వాళ్ళ' ఇంటికి వెళ్ళడం మానేశాడు. తరువాత రోజు ఆ తరువాత రోజుకూడా అంతే చేశాడు. స్కూలుకి గోపాలంకంటె ముందుగా వెళ్తున్నాడు. క్లాసులో గోపాలానికి ఎడంగా కూర్చుంటున్నాడు. స్కూలునుంచి తిరిగి రావడంలో గోపాలాన్ని తప్పించుకొందికి వీలులేకపోతోంది. గోపాలంతో నడుస్తున్నప్పుడు మాత్రం నిశ్శబ్దంగా నడుస్తున్నాడు. రెండోరోజు సాయంకాలం కొంతదూరం యింటివైపు నడిచేక, జేబులోంచి బటానీలు 'తీసుకోరా' అన్నాడు గోపాలం.

ఎలా ఊహించగలిగేడోగాని సుబ్బడు ఆ బటానీలు పుచ్చుకోడని మాత్రం ఊహించగలిగేడు గోపాలం.

"నాకొద్దురా" అన్నాడు సుబ్బడు.

సుబ్బడు ఎందుకొద్దన్నాడో గోపాలానికి తెలుసు.

బటానీలు పుచ్చుకొంటే బస్సు ఎక్కడ ఇవ్వవలసి వస్తుందోనని సుబ్బడి భయం.

"ఎవడిక్కావాలీ వీడి బస్సు!" అనుకొన్నాడు గోపాలం.

అయితే,

సుబ్బడి బస్సూ అంటే అక్కర్లేదుకాని, అటువంటి బస్సు కావాలనే ఉంది గోపాలానికి. కావాలని ఉన్నప్పటికీ తనకోసం అయితే ఇంట్లో అంత గోల చెయ్యకపోను.

కాని తమ్ముడిక్కావాలి ఆ బస్సు.

అందుచేతనంటే అందుచేతనే అటువంటి బొమ్మకోసం ఇంట్లో తెగగోల చేసేడు. గోలచేస్తే నాన్న తిట్టేడు; అమ్మ కొట్టింది. అమ్మ తిట్టింది; నాన్న కొట్టేడు.

ఆ సంగతి సుబ్బడికి ఎక్కడ తెలిసిపోతుందోననే భయం కలగడంచేత గోల చెయ్యడం ఆపుచేసేడు గోపాలం.

కాని, తమ్ముడిక్కావాలి ఆ బొమ్మ. మాటి మాటికీ 'బచ్చు బచ్చు' అంటూనే ఉన్నాడు.

తమ్ముడికేదో జబ్బు ఉందని గోపాలానికి తెలుసు. అందరి పిల్లలూ నవ్వుతారు. తమ్ముడు మాత్రం నవ్వడు. కాని మొన్న ఆ బొమ్మ చూసినప్పుడు నవ్వేడే! అయితే తమ్ముడి జబ్బు పోతుంది కాబోలు. బొమ్మ ఇస్తే పోతుంది. సుబ్బడు ఇవ్వడు. ఇంట్లో నాన్న కొనడు.

గోపాలం తర్కం, గోపాలం బాధాకూడా ఎవ్వరికీ తెలీదు.

తమ్ముడు మాత్రం తెలివి ఉన్నప్పుడల్లా 'బచ్చు బచ్చు' అంటూనే ఉన్నాడు.

చివరికి వాళ్ళమ్మకి విసుగెత్తి ఆ రోజు సాయంకాలం, "ఒరే గోపాలం ఆ సుబ్బణ్ణడిగి ఆ 'బచ్చుట బచ్చు' దాన్నోసారి పట్రారా" అంది.

అభిమానాన్నీ పౌరుషాన్నీ చంపుకొని, తమ్ముడికోసం ఆ సుబ్బడి దగ్గరికి వెళ్దామనుకొనే నిశ్చయానికి అంతకుముందే వచ్చేడు గోపాలం. ఎందుకోగాని నిశ్చయాన్ని కార్యరూపంలో పెట్టలేకపోతున్నాడు.

అమ్మ ఆజ్ఞ ఆఖరికి గోపాలాన్ని ముందుకు తోసింది.

గోపాలం రావడం సుబ్బడు చూసుకోలేదు. చూసి ఉన్నట్లయితే బొమ్మని ప్రత్యేకం ఇంట్లో యెక్కడో దాచకపోయినా, చేతిలో మాత్రం ఉంచుకోకపోను. దురదృష్టవశాత్తూ సుబ్బడి చేతిలో బొమ్మ ఉండగా వచ్చేసేడు గోపాలం.

వస్తూనే అడగవలసిందేదో అడిగేసేడు గోపాలం.

"తమ్ముడు ఏడుస్తున్నాడూ. ఒక్కసారి బొంబాయి బస్సుని మా అమ్మ ఇమ్మందిరా" అన్నాడు తనమాట సుబ్బడు నమ్మడేమోనని.

"కావాలిస్తే మా అమ్మనొచ్చి అడుగు" అని కలిపేడు.

గోపాలం అకస్మాత్తుగా వచ్చి అలా చెప్పడంవల్ల ఏమాలోచించడానికీ సుబ్బడికి అవకాశం లేకపోయింది. అందుచేత ఇంటిదగ్గర్నుంచి బొమ్మ పట్టుకొని, వేపచెట్టు వరకూ కిమ్మనకుండా వచ్చేడు. అక్కడికి వచ్చేలోపున ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్టుగా టక్కున ఆగేడు.

ఆగి 'రేపు తెస్తానని చెప్పరా' అన్నాడు.

❖ ❖ ❖

అందుకే ఆఖరిసారి అడిగినట్టుగా మళ్ళీ అడిగేడు గోపాలం.

"అయితే ఇవ్వవు కదరా" అన్నాడు.

వేపచెట్టు బరువుగా ఊగింది. గాలికి ఎండుటాకులు గలగల్లాడుతూ దొర్లేయి. దర్జీ దుకాణంలో కుట్టుమిషీను గరగరలాడింది. దుకాణంలో కూర్చొని కాజాలు కుట్టే పదిహేనేళ్ళ కుర్రవాడు ఏది ఉండో, ఏది లేకో, ఎవరి కోసమో, ఎందుకో పడే బాధనంతా కంఠంలోకి తెచ్చుకొని పాటతో పోగొట్టుకుంటున్నాడు. చప్టామీద పడుకున్న ముసలాయన మధ్య మధ్య దగ్గడం మర్చిపోతున్నాడు.

జవాబు చెప్పకుండా నిల్చున్నాడు సుబ్బడు.

గోపాలం కోపంతో, బాధతో వణికిపోతున్నాడని సుబ్బడికి తెలియడం లేదు.

సుబ్బడు గుక్కిళ్ళు మింగుతున్నాడు. బొమ్మని ఇవ్వాలనీ ఉంది. ఇవ్వడానికి ఇష్టం లేకుండా ఉంది.

"తమ్ముడు ఏడుస్తున్నాడు. ... అమ్మ అడగమంది.... లేకపోతే ఎవడిక్కావాలి.... నీ వెధవబస్సు" అని మాటలు విరుస్తూ అన్నాడు గోపాలం.

ఎర్ర సుబ్బడు ఎర్రబడ్డం చీకట్లో స్పష్టంగా తెలియడంలేదు. ముఖం అమ్మవారి గుడివైపు తిప్పుకున్నాడు. గుళ్లో నూనెదీపం అతని కళ్ళల్లో రెండుగా చీలింది.

"రేపు నే తెస్తారా... మా బావా, మరొచ్చి మా అక్కా రేపెళ్ళిపోతార్రా... అప్పుడు నే పట్టుకొస్తా కదూ" అన్నాడు సుబ్బడు.

బొమ్మను ఇవ్వడానికి, బావా అక్కా వెళ్ళిపోవడానికీగల సంబంధం గోపాలానికి అర్థం కాలేదు. కోపంతో పళ్ళు బిగించి ఊపిరి త్వరత్వరగా తీస్తూ ఏడుస్తూ ముత్యం మూడోసారిగా మళ్ళీ అడిగేడు.

నూనెదీపం కదుల్తోంది. సుబ్బడి గుండెలు త్వరితంగా కొట్టుకుంటున్నాయి. సుబ్బడు తటపటాయిస్తూ నిల్చున్నాడు. సెకెన్లు నడిచిపోతున్నాయనీ, నల్లగోపాలం అగ్గిసెగలా దహించుకుపోతున్నాడని తెలుసుకోకుండా ఉన్నాడు.

చివరికి తటాల్న నూనెదీపం నుంచి దృష్టి ఇటువైపు మరల్చి "ఇందరా" అన్నాడు.

దుకాణంలో పడుచువాడు పాట ముగించేడు. కుట్టుమెషీను గరగరలాడ్డం మొదలు పెట్టింది. ముసలాయన దగ్గి దగ్గి "హమ్మయ్యా" అని ఆయాసం తీర్చుకున్నాడు. గాలి ఎండుటాకులు గలగలలాడుతూ చెదిరిపోయేయి.

"ఇందరా" అని సుబ్బడు అన్నాడేకాని పుచ్చుకోడానికి గోపాలం అక్కడలేదు. ఏనాడో వెళ్ళిపోయేడు.

మర్నాడు –

ఉదయం ఆలస్యంగా లేచేడు సుబ్బడు. అందుచేతనో మరెందుచేతనో గోపాలం వాళ్ళ ఇంటికి ఉదయం వెళ్ళలేదు. తిన్నగా స్కూలుకే వెళ్ళిపోయేడు. వెళ్ళేసరికి బాగా ఆలస్యం అయింది. క్లాసులో అటూ ఇటూ పచారు చేస్తూన్న 'మాష్టారు' సుబ్బణ్ణి చూసి ఆగి,

"ఏరా, సుబ్బారావూ ఏడ్రా నీ నేస్తం?" అని అడిగేడు.

సుబ్బడికి తెలీదు.

"కలిసి రావడం మానీసేరేంరా?"

సుబ్బడు చెప్పలేదు.

"దెబ్బలాడుకున్నారుట్రా?"

"లేదండి."

అనేశాడేకాని సుబ్బడి మనసు పీకుతోంది.

ఆరోజు గోపాలం బడికి రానేలేదు.

సాయంకాలం అయిదున్నర గంటలకి చేత్తో బొంబాయి బస్సు పట్టుకొని వేపచెట్టు దాటేడు సుబ్బడు. ఏదో నేరం చేసినవాడి ముఖంలా ముఖం అంతా వాడింది. బరువుగా పడుతోంది అడుగు.

గోపాలం ఇంటిముందు, పెంటకుప్ప పక్క నిల్చొని ముగ్గురు పిల్లలు వీధిలోంచి యింటోకి తొంగి తొంగి చూస్తున్నారు. ఇద్దరివి, యెర్రగళ్ళ లాల్చీలు; ఖాకీ నిక్కర్లు. ఒకడికి నిక్కరే ఉందికాని చొక్కాలేదు. ముగ్గురి చేతుల్లోనూ తాళ్ళూ బొంగరాలు వున్నాయి. వాళ్ళకి ఆ ఇంట్లోకి వెళ్ళాలనీ వున్నట్టుగా వుంది. కాని ఎందుకో భయపడుతున్నట్టూగా వున్నారు. వాళ్ళ చూపులూ, వాళ్ళ గుసగుసలూ, మొత్తంమీద వాళ్ళ ప్రవర్తనా చూస్తూ సుబ్బడికి ఎందుకో గాని భయంకలిగింది. గుండెలు బరువెక్కేయి. జోరుగా నడుద్దామనుకుంటే అడుగు మాత్రం తేలిగ్గా పడ్డంలేదు. చేతిలోవున్న బొంబాయి బస్సు నెత్తిమీద కొండలా వుంది.

"ఏంరా, గోపాలం లేడూ" అని కొంచెం బెక్కుతూ అడిగేడు వెళ్తూనే.

ముగ్గురు పిల్లలూ గుడ్లు పెద్దవిచేసేరు.

వాళ్ళల్లో చొక్కా లేనివాడు దొంగ బాచిగాడు "ఇష్! నీకు తెల్దుట్రా?" అని సాశ్చర్యంగా అన్నాడు. ప్రమాదకరమైనది, ముఖ్యమైనది, ఆ సమయానికి ఎంతో గొప్పదైనా వార్త చెప్పబోయే ఆత్రత కనిపిస్తోంది బాచిగాడి ముఖంలో.

ముగ్గురు పిల్లలూ స్వరాలు బాగా తగ్గించి, మాటల్ని జోరుగా దొర్లించి సంగతి ఏమిటో వివరంగా చెప్పేరు. చెప్పేక.

"అర్రె నువ్వెళ్ళకరా బాబూ! ఎవురూ ఎళ్ళకూడదట. మావోళ్లు చెప్పేరు" అని ఒక ఎర్రగళ్ళ చొక్కావాడు గొంతుక తగ్గించి గోలపెట్టాడు.

ఆ మాటలు సుబ్బడికి వినిపించలేదు. తొందరగా గుమ్మంలోంచి రెండు మెట్లు దిగి ముందు గదిలోకి వెళ్ళేడు.

గదిలో ఓ వారకి గోడకి ఓ పాత సైకిలు చేరవేసి ఉంది. దానికి ఇవతలగా, ఒక తడిసి ఎండిన చాపమీద తలకింద చెయ్యి పెట్టుకొని ఒక పక్కకి తిరిగి పడుక్కొంది గోపాలం తల్లి. తడిసి ఆరని జుట్టంతా ఆమె వంటిమీదా చాపమీదా పడుతోంది. శుష్కించిపోయిన ఓ ముసలావిడా, మోటుగా వున్న ఒక నడివయసు ఆడమనిషీ ఆమె తల దగ్గర కూర్చొని నెమ్మదిగ యేదో మాట్లాడుతున్నారు.

గుమ్మంలోంచే గదంతా కలయజూసి తిన్నగా వెనక గదిలోకి వెళ్ళేడు సుబ్బడు.

వెనక గదికి కిటికీల్లేవు. గదినిండా నీడలు పడగలు విప్పుకొనివున్నాయి. చీకట్లో అడవిలాగ సామానంతా అస్పష్టంగా కనిపిస్తోంది. ఎడమవైపుకి యెత్తుగా భూతంలా నిల్చొంది పందిరి మంచం.

నీడల్లో మునిగిపోయేడు సుబ్బడు.

కొద్దిసేపట్లో, ముందుగదిలో కూర్చొన్న ముసలావిడ "అయ్యో, పిల్లడు ఏడుస్తున్నాడమ్మా" అంది.

ఎక్కడో ఏదో లోకంలో పాతుకుపోయినట్టుగా వున్న గోపాలం తల్లి మెల్లిగా కదిలి లేవబోతుంటే, "నువ్వుండమ్మా! నేవెళ్ళి సముదాయిస్తా" అని శుష్కించిపోయిన ఆ ముసలావిడే గుమ్మందాటి వెనకగదిలోకి వెళ్ళింది.

పందిరి మంచానికి పక్కగా, నేలమీద కూర్చుని, ఓ మేకుతో గచ్చుని బద్దల్చేస్తున్నాడు గోపాలం. వంచిన తల పాములబుట్టలా ఉంది. అడుగు పెదవి కోరకింద నొక్కుకు పోతోంది.

ఎదురుగా నిల్చున్నాడు ఎర్ర సుబ్బడు.

కొన్ని వస్తువులు మనుషుల్ని వేరుచేస్తాయి. కొన్ని పరిస్థితులు మనుషుల్ని దగ్గరగా తీసుకొస్తాయి.

ఒకప్పుడు నలుపు నిగనిగ మెరుస్తుంది. ఒకప్పుడు ఎండ చల్లాగా ఉంటుంది. "నిన్ను అంటం అంటం" అనేటి నక్షత్రాలే ఒకప్పుడు జారి కిందికిదిగి భూమిని అందుకొంటాయి.

ఎర్రసుబ్బడు చెప్పే మాటలు గదిలోకి వచ్చిన మసలావిడకి సరిగా అర్థంకాలేదు. కాని, గోపాలానికి స్పష్టంగా వినిపిస్తున్నాయి, తెలుస్తున్నాయి.

గోపాలాన్ని బొంబాయి బస్సు తీసుకోమంటున్నాడు ఎర్రసుబ్బడు.

"అచ్చంగా, అచ్చంగా తీసుకోరా! నా కొద్దురా ఇదీ" అంటూ చెయ్యిజాచి ఇస్తున్నాడు బొంబాయి బస్సుని.

గోపాలం కన్నెత్తలేదు, తల ఎత్తలేదు.

సుబ్బడికి అక్కర్లేదట ఆ బస్సు.

గోపాలానిక్కూడా అక్కరలేదు.

కావాలన్నది తమ్ముడు.

కావాలన్న తమ్ముడు ఏడీ? ఏడీ?

బొంబాయి బస్సు అక్కరలేదు; సుబ్బడి సానుభూతీ అక్కరలేదు గోపాలానికి. సుబ్బడికి అర్థం అవుతోంది గోపాలానికి ఎందుకంత కోపంగా వుందో.

అందుకే –

"మనవాడు కాదే. అల్లవాళ్ళ ఎర్రసుబ్బడు ఏడుస్తున్నాడు."

అనవలసి వచ్చింది ముందుగదిలో చాపదగ్గర తిరిగి కూర్చున్న ముసలావిడ.

●

*ఆంధ్రపత్రిక వారపత్రిక, 7-4-1954.*

కథ
1954, జనవరి

# నీడలు



**ప**ది గంటల రాత్రి.

సూర్యం తప్పించి మిగతా వారంతా గది వెనుక నడవలో పడుకున్నారు. గదంతా గలీజుగా వుంది. సర్దికట్టిన సామాన్లు అడ్డదిడ్డంగా పడి ఉన్నాయి.

గది మధ్యని ఒక తాటాకుల చాపమీద ఒక పాత కాలపు సందుగు పెట్టె, మినుకు వినుకుమనే ఒక చేతిలాంతరూ వున్నాయి. సూర్యం కూడా వున్నాడు.

"పెళ్ళాం పిల్లలూ, డబ్బా డవాలా! కొన్నాళ్ళు కట్టకట్టుకొని తిరగడం, చివరికి ఎక్కడో అక్కడ విడిపోడం" అనుకున్నాడు సూర్యం, సాధారణంగా అటువంటి సందర్భాల్లో అందరూ అనుకొనేట్టుగానే.

దాదాపు యిరవై సంవత్సరాలు; ఓ కంపెనీవారి ఆఫీసులో ముక్క వాసనవేసే గదిలో, వెల్తురు అందని ఒక మూలని కూర్చుని టైపిస్టుగా పనిచేసిన వెంకట సూర్యం ఒక ఏడాదినుంచి ఆ పని చెయ్యడం లేదు.

కంపెనీ ఉంటే కదూ, అందులో పనిచెయ్యటానికి?

ఎక్కడో ఎవడో మోసం చేస్తాడు ఎక్కడెక్కడో ఎందరెందరో దెబ్బ తింటారు. మంచు మాయమయినట్టుగా కంపెనీ దివాలాతీసి మాయమయింది. వెంకట సూర్యం వీధినిపడ్డాడు.

తరువాత ఈ సంవత్సరమంతా ఎలా గడిచిందో భగవంతుడెరుగును. అంతా ఒక యుగంలా నడిచింది. ఒక పీడ కలలా గడిచింది.

మరింక దాని గురించి ఆలోచించి వగచి ప్రయోజనంలేదు.

"మన పరిస్థితి ఇంకా నయమే."

ఏదో మళ్ళీ ఓ ఉపాధి అంటూ ఒక ఏడాదికైనా దొరికింది. ఒడ్డున పడేసిన చేపల్లా ఇంకా కొట్టుకుంటూనే వున్నారు మిగతా వాళ్ళంతా.

కొత్త నౌఖరి దొరికిందన్న మాటేగాని ఎక్కడ దొరికిందంటారు?

మూడువందల మైళ్ళ దూరంలో.

ఉడుకు రక్తం ఉన్నప్పుడు "ఎక్కడైతేనేం?" అనిపించేది. అప్పుడు ధీమాగా కాలం గడపగలిగేవాడు. అంతా అడ్వెంచరస్‌గా ఉండేది. ఇప్పుడు ఏదో ఒక రస్తాని బండీ లాగడం అలవాటయిపోయింది. అందులోనూ పోయేకాలమే కాని వచ్చేకాలం కాదు. ఇటువంటప్పుడు పొట్టచేత్తో పట్టుకొని, బండెడు సంపారాన్ని ఈడ్చుకొని, ముక్కూ మొహం ఎరగని పరాయిదేశానికి, అంత దూరానికి పోవాలంటే గుండె బేజారెత్తి పోతోంది.

ఆలోచించి, వగచి ప్రయోజనం లేదు.

తిండికోసం పశువులు కొండలకైనా పోయినట్టు, ఎక్కడికైనా సరే, ఎంత దూరానికైనా సరే, ఈ పిల్లా జల్లా, ఈ డబ్బా డవాలా, ఈ బాదరబందీ అంతా నెత్తిన వేసుకొని "అలో లక్ష్మణా" అనుకొని పోవలసిందే.

కానీవయ్యా, ఏం చేస్తాం!

పనికొచ్చేవైనా మోసుకు వెళ్లలేనివన్నీ అమ్మి పారేశావు గదా. విలువగల వస్తువులకి కాళ్ళొచ్చి ఏనాడో ఇంట్లోంచి నడిచిపోయాయి కదా. ఆనాడు చెమటోడ్చి సంపాదించగా మిగిలినవో, ఈనాడు చెయ్యిజారి తెచ్చినవో, లేక గిన్నె ముంత అమ్మగా వచ్చినవో, ఏవో నాలుగు రాళ్ళున్నాయి కదా, రేపు సాయంకాలం ఆ నలుగురు పిల్లలూ, నువ్వూ, నీ ఆడదీ టిక్కెట్లు కొనుక్కొని సామాన్‌తో సహా గాడీ ఎక్కేస్తారు. ఎల్లుండి అక్కడెక్కడో దిగుతారు. ఏ చెట్టుకిందో, ఏ సత్రంలోనో మకాం పెడతావు. అక్కడ మరో చీకటి కొట్లో నువ్వూ, నీ టైపు మెషీనూ తయారు.

బతక్కపోవు ఫరవాలేదు.

బతక్కపోయినా ఫరవాలేదు, నీ పెళ్ళానికీ పిల్లలకీ తప్పించి.

ఇహ, నీ తరవాత వాళ్ళ మాటా – అడుగుతావు?

అంతటా వినిపించే పాట విన్నావు కదా, "ఎవరికి వారే యమునా తీరే."

రాత్రి పదిగంటలే అయింది; నిశ్శబ్దంగా ఉన్నది గది. ఎర్రగా, నిశ్శబ్దంగా ఏడుస్తున్నవి గది గోడలు. మూలనున్న సామానంతా పైకి తర్లిపోవడంచేత, ఏళ్ళ తరబడి భద్రంగా దాగున్న చెత్తా చెదారం అంతా ఎక్కడిదక్కడే, ఏం చేయాలో తోచనట్టు, ఉండిపోయింది. తారుపూసిన రెండు సీనారేకు పెట్టెలూ. ఆకుపచ్చ రంగు పులిమిన ఒక దేవదారు పెట్టే, ఒక గోనెమూటా, కొబ్బరి తాళ్ళ మడతల్లో

మూలుగుతున్నాయి.

సూర్యానికి నిద్ర రావడంలేదు. అతనికి సంబంధం ఉన్నంతమట్టుకు ఆ వూరి కది ఆఖరి రాత్రి.

"ఈపాటికి రేపు పాసెంజర్లోనూ, ఎల్లుండి మరో వూర్లోనూ వుంటాం. ఇవాళ, రేపు, ఎల్లుండి క్యూ నడుస్తోంది, కాలం పరిగెడుతోంది" అనుకొంటూ సందుగు పెట్టె తెరిచేడు సూర్యం.

అందులో ఏవేవో ఎన్నెన్నో కాయితాలున్నాయి. నాల్రోజులు ఉంచవలసిన కాయితం ఏదైనా సరే అందులో ఉన్నదన్నమాటే.

ఈ కాయితాలేమిటో చూసి, పనికిరానివేవో చించి పారేయవచ్చు. అబ్బా, ఎన్ని కాయితాలున్నాయి!

ధూళి పట్టినవి, పురుగులు కొట్టినవి పైకి తీస్తూంటే చాలా కాయితాలు వస్తున్నాయి.

ఉత్తరాలు, ప్రత్యుత్తరాలు, బిల్లులు, రశీదులు, సర్టిఫికెట్లు, తాఖీదులు, చిరునామాలు, పూర్తి పరిష్కారం చేసి పుచ్చుకున్న ప్రోనోట్లు, లాయర్లు పంపిన ప్రత్యుత్తరాల నకళ్లు, అంకెలు, పద్దులు, మనియార్డర్ల రశీదులు, శుభలేఖలు, వగైరా వగైరాలు. ఒకటీ ఒకదాని వెనుక ఒకటీ వస్తున్నాయి తీస్తూంటే.

ఇదేదో జాతక చక్రం.

సంవత్సరం, మాసం, తిథి, వారం, నక్షత్రం, నక్షత్ర పాదం, ఘడియ, విఘడియ, లగ్నం, దశాశేషం.

ఎవరిది?

చిరంజీవి వేంకట సూర్యనారాయణ జాతకచక్రం ఇది.

పొగబట్టిన గోడలకి వేసిన సున్నం ఆరగా వచ్చే రంగులా పొగతా ఎర్రగా ఉంది కాయితం. నాలుగువైపులా పసుపు, మధ్యగా పసుపులో శ్రీకారం, శుభం శుభం.

సూర్యం పుట్టినప్పుడు తాత వేయించిన చక్రం కాబోలు. తాటాకుల మిద్దె ఇంట్లో, నూనె దీపం దగ్గర కూర్చొని, చుట్టకాలుస్తూ ఏ పంతులో రాసివుంటాడు. వాసనచూస్తే పాత వాసన వేస్తోంది.

ఎంతటి పాత మనిషి ఈ వెంకట సూర్యం?

"ఈ అరువదియున్నూ తెలుగు సంవత్సరముల పేళ్లు" "ఈ పన్నెండున్నూ తెలుగు మాసముల పేళ్ళు" అనే మాటలే తనకి జ్ఞాపకం వున్నవి. సంవత్సరాలనీ, నెలలనీ, పేర్లుమాత్రం ఎగిరిపోయాయి. ఇంగ్లీషు తేదీ గుర్తుకు తెచ్చుకోవాలిప్పుడు.

పుట్టినరోజు ఎప్పుడు వస్తుందో బాగా గుర్తుంచుకొని దానికోసం కాసుక్కూర్చొని, ఆ సుదినానికి స్వాగతం చెప్పి, సాగనంపిన కాలం ఏనాడో పోయింది. ఇప్పుడు అది ఏ రోజో, వస్తుందో లేక వెళ్ళిపోయిందో గుర్తుకు తెచ్చుకోవాలి.

ఊఁ అవును. మూడు రోజులయింది సెప్టెంబరు ఇరవైదాటి. అంటే మనకి నలభై అయిదేళ్ళు దాటేయన్నమాట.

కాలం పరుగెడుతోంది. కాయితం పాతవాసన వేస్తోంది. మరి కొద్ది దినాలకి మనం ముసలికంపు కొడతాం.

అయితే నలభయ్యయిదేళ్లు వెళ్ళిపోయేయా?

వెళ్లేయి, వెళ్ళకేం చేస్తాయి.

వెళ్ళిపోతోన్న ఈ ఏళ్ళన్నీ ఎక్కడికి వెళతాయి చెప్మా.

ఏళ్ళన్నీ ఏట్లోకి వెళ్ళేయి. మనమంతా కాట్లోకి పోతాం.

జాతకచక్రం చాపమీది కాయితాల్లోకి పోయింది. పెట్లోంచి మరికొన్ని కాయితాలు పైకి వచ్చేయి.

ఒక కవరు.

జల్లూరు బ్రాంచి పోస్టాఫీసు ముద్ర పక్కనే జలంధర్ కంటోన్మెంట్ పోస్టు ముద్ర, రెండవపక్క అడ్రెసు: A.T. 17645, నాయక్ వెంకట రమణయ్య, నెం.7, ఆనిమల్ ట్రాన్స్‌పోర్టు కంపెనీ, జలంధర్.

కవరులోంచి లాంతరు వెలుగులోకి భయపడుతూ వచ్చింది ఉత్తరం. పంథొమ్మిది వందల పదహారో సంవత్సరంలో సూర్యం మేనమామ సూర్యం తండ్రికి రాసిన జాబది. "అయితే ఆ తరువాత కాబోలు, నాయన హవల్దారవడం, తరవాత చచ్చి చెడి జమేదారవడమూను."

ఉత్తరం నడుస్తోంది! ".... అక్కయ్యకి పత్యం పెట్టేరు. మచంమీంచి లేచి ఇంట్లో కొంచెం తిరుగాడ గలుగుతోంది. చి॥సూర్యం స్కూలుకి వెళుతున్నాడే కాని రెండురోజులయి జ్వరం తగుల్తోంది. వాడిక్కూడా గాలి సోకుతుందేమోనని హడిలిపోతున్నాం. ఇది ఇలా వుండగా, మా చెల్లెమ్మ మా అమ్మని ఎందుకో రమ్మని కబురుచేసింది. నిల్చున్నపాటున మా అమ్మ అక్కడికి పరుగెత్తింది. ఇహ ఇంట్లో చాకిరీచేసే వాళ్ళెవరూ లేరు. నా ఆడమనిషి ఎటువంటిదో నీకు తెలుసుగదా. అందులోనూ దానికి ఎడపిల్ల. అందుచేత అన్నీ నేనే చూసుకొని చేసుకోవలసి వస్తోంది. నువ్వు సొమ్ము పంపిస్తున్నట్టు లోగడ రాసేవు. ఇంతవరకూ సొమ్మూలేదు, నీ దగ్గరనుంచి మరే కబురూ లేదు. ఇక్కడ పరిస్థితులు ఎంత ఇరకాటంగా వున్నాయో నువ్వొక్కసారి వచ్చి చూస్తే తెలుస్తుంది..."

అక్షరాల నలుపు ఇప్పుడు తెలతెలపోతోంది. కాని, అప్పట్లో ఎంతో నల్లగా వెల్గిన ఈ అక్షరాల్ని చూసుకొని నాయక్ రమణయ్య ఏమనుకొని వుంటాడు? ఊహించవచ్చు. కాని, గడచిన చిక్కులగురించి ఇంకా ఊహలెందుకు;

ఈ ఉత్తరాల్లోని ఈ పాత విచారాలన్నింటినీ చాపమీది చరిత్రలో కలిపెయ్. అంతా కలిసి ఆఖర్న తగలెట్టవచ్చు.

కాయితాలకి మడతలు విడుతున్నాయి. మడతలు మళ్ళీ పడుతున్నాయి. చాపమీదికి వెళుతున్నాయి.

నాయనకి అమ్మ సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి వ్రాయింపించిన ఉత్తరముల అంశములు, చి॥ వెంకటసూర్యాన్ని ఆశీర్వదిస్తూ బాగా చదువుకోమని చెపుతూ నాయన రాసిన జాబులు, మూడో ఫారం క్వార్టర్లీ పరీక్షల్లో వచ్చిన మార్కుల లిస్టు. ఇంగ్లీషులో ఇరవై; సైన్సులో పన్నెండు. "శనివారం మెయిల్లో వస్తాను. అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చు" అని ఎవరో ఎక్కణ్ణించో పంపిన కార్డు. ఉద్యోగానికి దరఖాస్తు పెట్టగా వచ్చిన ఒక జవాబు. జవాబు రాని ఒక అర్జీ. ఎవరిదో అడ్రెసు. ఏవో అంకెలు. ఇదేదో శుభలేఖ.

"చిరంజీవి వేంకట సూర్యనారాయణకు... చిరంజీవి సౌభాగ్యవతి రాజరతనమ్మను యిచ్చి వివాహము జరిపించుటకు పెద్దలు నిశ్చయించినారు గాన, ఏతత్ శుభముహూర్తమునకు...."

పెద్దలు నిశ్చయించిన, ఒకనాటి నడిరాత్రి శుభ ముహూర్తాన్నే జరిగిన ఈ పెళ్ళిమాట కూడా తలపెట్టకూడదు.

మసిబొగ్గులా తయారయిన రాజరతనమ్మ రామనామస్మరణ చేసుకొని ఇప్పుడిప్పుడే పడుక్కుంది.

అన్ని పెళ్ళిళ్ళూ శుభముహూర్తాల్లోనే జరుగుతాయి. కాదని ఎవరన్నారు.

వరసగా కాయితాల్ని చూడ్డమేకాని పూర్తిగా చదవకుండా మరికొన్ని కాయితాల్ని తీసి కిందని పడేసి "ఇంకా ఎన్ని వున్నాయి?" అనుకుంటూ పెట్టెలోకి చెయ్యిపెట్టి తీసేసరికి సూర్యం చేతిలోకి పాత అట్ట ఒకటి వచ్చింది.

అట్టని దీపానికి దగ్గరగా పెట్టి చూసేడు సూర్యం.

"విరిగిన ఇటికలూ, రాలిన పెంకుటూ తప్ప ఇంకేం ఉంటాయి" అనుకొని అడుగుపెట్టిన పాడుపడిన ఇంట్లో ఓ గదిలో గోడని రంగుల పటాలు – పాతవే అనుకోండి – కనిపిస్తే ఆశ్చర్యపోయినట్టుగా ఆశ్చర్యపోయేడు సూర్యం తన చేతిలోని పాత అట్టని చూసి.

చూసేడు, కొంతసేపు చూసేడు. మరికొంతసేపు చూసేడు. చాలాసేపు చూసేడు.

నెల దినాల కిందట ఒక పిక్చర్ చూశాడు సూర్యం. 'మనసేమీ బాగులేదు.

పోనీ కాస్సేపు సినిమాలో కూర్చొని వద్దాం' అనుకొని బయల్దేరి వెళ్ళేడు. టిక్కెట్టు తీసుకొని హాల్లోకి వెళ్ళి కూర్చున్నాడు. లోపల ఎవరూ లేదు. హాలంతా శవాల కోసం ఎదురుచూసే స్మశానంలా ఉంది. చివరికి ఎలాగైతేనేం ఓ పాతిక శవాలు కాబోలు చేరాయి నెమ్మదిగా. దివ్వా దివ్వా మనే థియేటర్లో చాలాసేపు దిక్కులు చూస్తూ కూర్చోగా ఆట ఆరంభించేరు. ఆరంభిచేక తెలిసివచ్చింది సూర్యానికి ఆ పిక్చరు తనిదివరకు చూసిందేనని.

ఇరవై సంవత్సరాల పైచిలుకు అయుండవచ్చు. ఆ చిత్రాన్ని మొదటిసారి చూసి. అప్పట్లో అది చాలా పాప్యులర్ పిక్చర్. తిరిగి చూస్తోంటే, "ఇదేనా అప్పుడు ఎంతో బావున్నదనిపించిన చిత్రం!" అని ఆశ్చర్యం కలిగింది. చనిపోయిన వారందర్నీ పిలిపించి తిరిగి తెరమీది కెక్కించినట్లుగా, మిక్కిలి బాధాకరంగా ఉంది.

అయ్యయ్యో ఇదేనా ఆ చిత్రం?

ఇందులో నటిస్తున్నవాళ్ళు కొంతమంది బతికే ఉన్నారు. ఇప్పటికీ సినిమాల్లో నటిస్తున్నారు. కాని, అప్పటికీ ఇప్పటికీ ఎంతమార్పు! ఇందులో ఎంతో పాతగా కనిపిస్తున్నారేకాని, ఎంత లేతగా ఉన్నారు! ఈ బొమ్మలో కనిపిస్తూన్నట్టుగా వాళ్ళిప్పుడు లేరు. మళ్ళీ ఎప్పటికీ వుండరు. కొంతమంది ఏదోవిధంగా ఉండనైనా ఉన్నారు.

కాని, మిగతా వాళ్ళంతా ఏరీ?

రాణీగారి పెంకె తమ్ముడి వేషం వేసిన కుర్రవాడే కాబోలు ఆ మధ్య అకస్మాత్తుగా చనిపోయేడు, తాగుడువల్ల అయుండవచ్చు. రాజభటుల్తో మాట్లాడ్డానికి సరదాపడే ఆడపిల్ల వేషం వేసిన ఆడపిల్ల ఆ రోజుల్లో అందరికీ అభిమానతార. పెళ్ళి చేసుకొని, మరి ఫికర్లేకుండా పోయింది. నవ్వు ముఖంతో నటిస్తూన్న ఆ హీరో, ఆ సచివోత్తముడి కుమార రత్నం, అతనే ఈమధ్య ముసలి విలన్ పాత్రలు ధరిస్తున్నాడు. అష్టకష్టాలూ పడే ఆ బానిస పాత్ర ధరించినవాడు మరింక తెరమీద కనిపించనే లేదు. హీరోయిన్గా నటిస్తూన్న ఆ లేడికళ్ళ లేతపిల్లనే ఎవడో ఫిలిం ప్రొడ్యూసర్ ఘోరంగా దగాచేయగా ఆమెకి ముఖం తిరిగి మతిచెడింది. దయగల వారెవరో చేరదీసి పోషిస్తున్నారు. అమాయకంగా అమిత విశ్వాసంతో పనిచేసే ఆ రాజానుచరుడి పాత్ర ధరించినవాడు ప్రస్తుతం ఈ ఊళ్లోనే అడుక్కుతింటున్నాడు. మరి మిగతావాళ్ళంతా? ఏమో! ఏమయారో! అంతా బేఫికరే.

సుమారు ఇరవై సంవత్సరాల క్రితం ఆనాడు చూసినప్పుడు ఈ చిత్రమే ఎంతో బావున్నదనిపించింది. ఆనాటి రాత్రి సినిమా అయాక బైటికి వచ్చేసరికి వెన్నెల తడిగా, చల్లగా ఉంది. తువ్వాలు కప్పుకుని, కథలో హీరోయిన్నీ, సరోవరం దగ్గర దృశ్యాన్నీ తల్చుకొని నడుస్తూంటే మనసంతా వెచ్చగా కరిగింది. ఉత్సాహంతో వళ్ళంతా వేడెక్కి తేలికపడింది.

కాని, ఎంతోకాలం అయాక, ఎప్పటిదో అయినట్టి ఆ చిత్రాన్నే తిరిగి చూసినప్పుడు "అయ్యయ్యో" అనిపించింది. మనసుకి ఎంతో కష్టం తోచింది. ఏనాడో జరిగిపోయిన సంఘటనలో పాల్గొని ఎక్కడెక్కడికో చెదిరిపోయిన వ్యక్తులందర్నీ బలవంతాన రప్పించి ఆ సంఘటననే తిరిగి జరిపించినట్టుగా ఉంది. అసలా సంఘటనే అర్థరహితం, అందులో పాల్గొన్న వ్యక్తులంతా అసమర్థులు. బొత్తిగా అనుభవం లేని వాళ్ళు. వారికి చేతకాని, వారు చేయలేని పనులు వారిచేత బలవంతాన చేయించినట్టుగా ఉంది. వారుచేసే ఆక్రందనలా ఉన్నాయి వారు పాడిన పాటలు.

ఎందుకు వాళ్ళనంతా అలా కష్టపెట్టడం? అర్థంలేని ఈ చిత్రాన్ని ఎందుకు తీయడం? చూసేవాళ్లు ఎందుకు చూడ్డం?

లాంతరు వెలుగులో కనిపిస్తోన్న ఆ పాత అట్టమీది ఫొటో చూస్తోంటే సూర్యానికి అదేరీతిగా ఆలోచన వెళ్తోంది. అదేరీతిగా "అయ్యయ్యో" అనిపిస్తోంది. అదేరీతిగా కష్టంగా ఉంటోంది.

చాలా సంత్సరాల క్రితం, ఒకరోజు, గోడనివేళ్ళాడే ఈ ఫొటో తాడుతెగి కిందని పడింది. 'ఫ్రేం' విరిగింది. అద్దం బద్దలయింది. పిల్లలు తీసి పాడుచెయ్యకుండా రతనమ్మ తీసి ఈ పెట్లోపడేసి వుండాలి. తను దానిసంగతే మర్చిపోయేడు.

"ఇంటర్మీడియేట్ క్లాస్. ఫస్టియిర్, 1926 –27."

అని అట్టమీద వున్న అక్షరాల్లో, అంకెల్లో కొన్ని కనిపించకుండా పోయేయి. మిగతావి కనిపించకుండా పోతున్నాయి. అట్ట, చాలాచోట్ల, పిన్నులతో పొడిచినట్టు తూట్లు పడింది. ధూళితో నిండిన ఫొటో కాయితపు మెరుగంతా పోయింది. అంచులన్నీ పురుగు తినేసింది.

ఆ గదిలో, ఆ సయమంలో, ఆ లాంతరు వెలుగులో ఆ ఫొటో కూడా ఒక బతికిచెడ్డ మనిషిలా దీనంగా వుంది. సాల్వేజి సామాన్లలోకి విసిరేసిన పనికిరాని పాతవస్తువులా వుంది. వెలవెల పోతోంది.

ఫొటోలో వున్న అరవయ్యేడుగురు వ్యక్తులూ రకరకాలుగా ఉన్నారు, నవ్వుతున్నారు. నవ్వబోతున్నారు. సీరియస్గా వున్నారు. మూతులు బిగించి చూస్తున్నారు. నోళ్లు తెరచుకొని కూర్చున్నారు. అంతా కూడా వెలవెల పోతున్నారు.

సున్నంలేని గోడలమీద లాంతరు వెలుగు ఆర్చుకుపోతోంది. ఫొటోమీద కూడా అంతే. అందుచేత లాంతర్ని కొంచెం దగ్గరగా లాగేడు సూర్యం.

ఇంటర్మీడియేటు మొదటి సంవత్సరపు ఆఖరి రోజుల్లో, సెలవుల ముందు తీసిన ఫొటో అది.

ఎలా వుండేవి ఆ సంవత్సరపు తొలిరోజులు?

ఎలా వుండడం ఏమిటీ? ఆ సంవత్సరం అంతాకూడా తొలిరోజుల్తోనే గడిచిపోయింది.

నిజంగా ఆ రోజులు అంటూ ఎప్పుడైనా ఉండేవా?

తెర. తెరవెనుక తెర. దాని వెనక తెర. తెరలు తెరలుగా సంవత్సరాలు జరిగిపోయేయి. దూరంలో కనిపిస్తోంది చిన్నదిగా ముచ్చటగా కాలేజీ. కాలేజీలో కనిపిస్తున్నారు ఉత్సాహపూరితులైన యువకులు.

నిర్మానుష్యంగా వున్నట్లనిపించే పాతకాలపు భవనాల్లో వరసగా పొడవుగా గది వెనక గదులుంటాయి. గదులన్నీ చీకటిగా వుంటాయి. గది గదికీ ఎదు రెదురుగా వున్న తెరుచుకున్న ద్వారంలోంచి దూరంలో ఒక చిన్న పెరడు కనిపిస్తుంది. అక్కడ తెల్లటి తులసికోటలో గుబురుగా పెరిగిన తులసి మొక్క వుంటుంది. ఒక పక్కకి పచ్చటి బంతిపూల మొక్కా, దాని వెనుకనే ఒక సన్నజాజి తీగా కనిపిస్తాయి. అక్కడ సీతాకోక చిలకలు ఎగురుతూ వుంటాయి. అక్కడ ఎండ పచ్చిగా వుంటుంది. తులసికోటకి కొంచెం ముందుకి తళతళ మెరిసే ఇత్తడి బిందె ఒకటి బోర్లించి వుంటుంది. బిందెమీద కూర్చొని ఒక అందాల ఆడపిల్ల ఏదో ఆలోచిస్తూ వుంటుంది.

ఇంటి పొడవుకీ వుండే ద్వారాల్లోంచి, గదుల చీకటిలోంచి చూస్తోంటే ఆ పెరడు అతి నిశ్శబ్దంగా, ఎంతో మనోహరంగా, నిజంగా అక్కడ లేనట్టుగా, మూగ సినిమాలా, తెరమీద రంగు బొమ్మలా, నిద్రలో వచ్చిన సుఖమైన కలలా వుంటుంది.

ఆ తొలిరోజుల కాలం ఆ రీతిగానే కనిపిస్తోంది చింకి చాపమీద, మినుకు దీపం దగ్గర కూర్చున్న సూర్యానికి ఆ సమయంలో.

రెండు సంవత్సరాలు దండయాత్ర చేసి మూడవ దండయాత్రలో "మెట్టు" దాటి ఇంటర్లో ప్రవేశించిన రోజులవి.

ఎన్నెన్నో కొత్త ముఖాలు కనిపిస్తాయనే వుత్సాహంతో కాలేజీకి వెళ్లడం; కలకల్లాడే కాలేజీకి వెళ్ళేసరికి కొత్తకొత్త ముఖాలు కనిపించడం; అంతటితో ఆ వుత్సాహం ఇంకా ఎక్కువ అవడం –

బొమ్మల కొలువు పెట్టేముందు చెల్లాచెదురుగా పడేసిన బొమ్మల్లా వున్నారంతా. ఈ బొమ్మ రంగు బావుంది. ఆ బొమ్మ వేషం బావుంది. ఈ బొమ్మ ఎక్కడిది? ఆ బొమ్మ ఏ ఊరుది?

అందరితోనూ మాట్లాడాలని వుండడం; కొందరితో మాట్టాడ్డానికి మొహమాట పడ్డం; తమ హైస్కూలు నుంచి వచ్చిన వారంతాకలసి అల్లరిచేయడం; అంతా కోలాహలంగా వుండడం.

అదంతా కలకాదు. ఆ రోజులు నిజంగా వుండేవి. ఈ బొమ్మలో మనుష్యులు నిజంగా వుండేవారు.

ఈ లాంతరు వెలుగులో ఈ తూట్లుపడ్డ పాత అట్టమీద కనిపించే ఈ బొమ్మలే, ఈ నీడలే ఆ రోజుల్లో కాలేజీలో ఎంతో గల్లంతు చేసింది.

యాభై వున్నాయి, గల్లంతు చేసిన నీడ బొమ్మలు, మిగతావాళ్ళు?

ప్రిన్సిపాల్, లెక్చరర్స్ అండ్ ప్యూన్స్!

ప్రిన్సిపాల్‌గారూ లెక్చరర్లూ దిగువని కుర్చీల్లో కూర్చున్నారు. వారి వెనుక, వారి ఎగువకి మూడు వరుసల్లో మిగతావారంతా ఉన్నారు. మీదివరసలో చెరోపక్కా వంక పొగాలు పెట్టుకొని మీసాలు దిద్దుకొని నిల్చున్న వాళ్ళిద్దరూ కాలేజీ ఆఫీసు బంట్రోతులు. ఎడమవైపు నిల్చున్నవాడు ఫొటోలో కొద్దిగా చెదిరేడు. కాని కాలేజీలో మాత్రం కదలకుండా స్తంభంవార నిద్రపోయేవాడు. ప్రిన్సిపాల్ పిల్చినా సరే బూతులు తిట్టుకోకుండా లేచేవాడుకాదు. రెండోవైపు నిల్చున్నాడే, అతడి కొడుకుమీదే ఆరోజుల్లో ఏదో పోలీసు కేసు వుండేది. అందుచేత ఇతనెల్లప్పుడూ బెంగగా కనిపించేవాడు. ఆ కేసు ఏమయింది? ఆ కొడుకు ఎక్కడున్నాడు? ఈ ప్యూన్స్ ఇద్దరూ ఏమయేరు?

ముందుండే కుర్చీల వరసలో మధ్యగా కూర్చున్న పెద్దమనిషే కాలేజీ ప్రిన్సిపాల్. బుట్టపాగా. అంగారు బొట్టు. నవ్వు ముఖం. లాంకోటు. పంచె. మేజోళ్ళు. బూటూ. అప్పటికే యాభయ్యేళ్ళుంటే ఇప్పటికింకా బతికి ఉంటాడా? ఆ రోజుల్లో తన మనవరాలికోసం కాలేజీలో చదివే తనకులం పిల్లలందర్నీ పిల్చి భోగట్టా చేసేవాడు. ఆయన వెనకనే ముంగిలా ముఖం పెట్టుకొని నిల్చున్న 'లెక్కల కుర్రాడు' చివరికి ఆ పిల్లకి తాళికట్టి దానికొంప ముంచేడు. ప్రిన్సిపాల్‌గారే కాని బతికివుంటే, మనవరాలి పెళ్ళి గురించి తల్చుకున్నప్పుడు ఆయన ముఖంలో నవ్వున్నది కనిపించబోదు.

ప్రిన్సిపాల్‌కి ఎడమవైపున ఏడుగురు లెక్చరర్లు, కుడివైపున ఏడుగురు లెక్చరర్లు. వారిలో ఎక్కువమందికి పాగాలూ. మీసాలూ, లాంకోట్లు, పంచెలు. అంతా భారీగా ఉండే మనుష్యులు. ఆరోజుల్లో ఎంతో పెద్దవాళ్ళలా, జీవితంలో బాగా పండిపోయిన వాళ్ళలా కనిపించేవారు. ఈ బొమ్మలో చూస్తే కొందరే ముసలివాళ్ళలా కనిపిస్తున్నారు. కొందరిది నడివయసు, కొందరిది యవ్వనం.

ప్రిన్సిపాల్‌గారికి కుడివైపున, కెమేరావైపు చూడ్డానికి భయపడి కాబోలు నేలవైపు చూస్తూ, సూటు తొడుక్కొని కూర్చున్నాయనే ఇంగ్లీషు లెక్చరరు. బొమ్మ చూస్తే ముప్ఫయేళ్ళవాళ్ళా ఉన్నాడు. క్లాసువైపు చూడ్డానికి భయపడే కాబోలు, ఎటూ చూడకుండా ఏదోవిధంగా పాఠం గొణిగేసేవాడు. శ్రీరామచంద్రా, ఇతగాణ్ణెందు కంతగా బాధపెట్టేవారా స్టూడెంట్సంతా?!

కుర్చీల్లో ఒక చివరికి, ఎడమకి కూర్చున్న వారిద్దరికీ అరవపాగాలున్నాయి. మీసాలు లేవు, తెలుగువాళ్ళల్లా లేరు, కారు. ఆ ఇద్దరూ "ఫిజిక్స్ కెమిస్ట్రీలు." "మమ్మల్ని తిట్టండి, కావాలిస్తే కొట్టండి. కాని అయ్యలారా; మమ్మల్ని బతకనివ్వండి" అన్నట్టుగా చేతులు కట్టుకొని, నోళ్ళు కొంచెం వేళ్లాడవేసుకొని బెదురుగా చూస్తున్నారు.

ఇంగ్లీషు లెక్చరరు పక్కనే "కౄరాత్ముడజామీళుడు" రీతిగా కనిపించే ఆయనే జువాలజీ చెప్పలేని లెక్చరరు. వెడల్పు ఛాతీ, భయంకరమైన మీసాలు, సున్నపుతట్టలాంటి పాగా. అతను మిక్కిలి మంచివాడు, నెమ్మదైనవాడు. అతని దురదృష్టం ఏమిటోకాని అతనొక "పెళ్ళాల పులి" అయిపోయేడు. పెళ్ళాం రావడం, పెళ్ళాం పోవడం. ఆ రీతిగా అతని కప్పటికే ముగ్గురు భార్యలు చనిపోయేరు. తరువాత నాల్గవతూరి వచ్చిన భార్యే అతనిపాలిట పెద్దపులి అయింది. సూర్యం ఊరే ఆమెది. ఆమె వచ్చిన తరువాత ఈ "పెళ్ళాల పులి"ని ట్రెయిన్‌లో చూసి పోలికే పట్టలేకపోయేడు సూర్యం.

కుడివైపు చివరినుంచి ఒకటవ, రెండవ కుర్చీలలో వరసలో కూర్చున్నవారు తెలుగు, సంస్కృత పండితులు. లాంకోట్లు, పంచలు, పాగాలు. సంస్కృత పండితునిది కొంచెం ముసలి ముఖం. కాని బాగుగా గీసిన ముఖం. మంచి తిథి, మంచి వారం, మంచి నక్షత్రం, అన్నీ మంచిగా జతపడిన ముహూర్తంలో వచ్చే మంగలి కత్తికోసం ఎదురుచూసే ముఖం తెలుగు పండితునిది. వాళ్ళిద్దర్నీ ఎవ్వరూ లెక్కచేసేవారు కాదు. "దేశ భాషలని తూలనాడే వారంతా చంకనాకి పోతారర్రా వెధవాయిల్లారా" అంటూన్నట్టుగా వున్నారు సంస్కృత పండితులు. "బావగారు బాగా సెలవిచ్చేరు. మాతృభాషని తూలనాడే వెధవల గతికూడా అంతే" అంటున్నట్టుగా వున్నారు ఆంధ్రభాషోపన్యాసకులు.

పండితుల పక్కనే టీ.బీ.తో బాధపడే హిస్టరీ లెక్చరర్ కూర్చున్నారు. అతని పక్కని కూర్చున్నందువల్ల టీ.బీ. ఎక్కడ అంటుకుంటుందోననే భయం చేతనే అన్నట్టు ఊపిరి బిగబట్టి కూర్చున్నాయన లాజిక్ లెక్చరరు. అడగో మాథమాటిక్స్ లెక్చరరు. మనుష్యుల్లో ఎద్దువంటి వాడు. లెక్కల్లో కూడా అంతే.

లెక్చరర్ల వెనక మూడు వరసల్లో నిల్చున్నారు విద్యార్థులు.

ది అండర్ గ్రాడ్యుయేట్స్!

మొదటి వరసలో నేలని ఇరవయ్యొక్కమంది. ఆ వెనక బల్ల లెక్కినవారు పద్దెనిమిది, ఆ మీదికి ఇంకా ఎత్తయిన బల్లమీద, బంట్రోతులిద్దరూ అంగరక్షకులుగా చెరో పక్కా ఉండగా నిల్చున్న స్టూడెంట్స్ పదకొండుగురు.

ఎవరు వీరంతా?

వీరే ఆనాటివారంతా.

అలా చూస్తోంటే మనసులో చెదిరిపోతోన్న గుర్తులు మళ్ళీ కుదుటబడుతున్నాయి. పోలికలు దొరుకుతున్నాయి. వెనుకటి భోగట్టాలు, సంగతులు జ్ఞప్తికి వస్తున్నాయి.

దాదాపు ఇరవయ్యేడు సంవత్సరాల క్రితం, ఒకనాటి సాయంకాలం, కెమెరా క్లిక్ చేసిన అరక్షణంలో రకరకాలుగా నిల్చుని చూస్తోన్న వారంతా అలాగే నిలబడి ఇంకా అలాగే చూస్తున్నారు.

ఎక్కువమంది పల్చటి లేతమీసాలవారు. కొంతమంది ఫ్రెంచ్ కట్, ఒకనిది బొద్దుమీసం. కొంతమంది మిగతావారికంటే వయసులో బాగా పెద్దవాళ్ళు. ఆ రోజుల్లో ఎంతో ఉత్సాహంగా ఉన్నవారే వీరంతా. ఆ ఛాయలు కొందరి ముఖాల్లో కనిపిస్తున్నాయి. ఎంతో అల్లరిచేసేవారు. వాళ్ళ అల్ప ప్రజ్ఞలకి గొప్ప పడిపోతూ వుండేవారు. స్వల్పాతి స్వల్ప విషయాలకి తెగద్వేషించుకునేవారు. అందరూకూడా మధురమైన కలలు కనేవారు. చిన్నవో పెద్దవో ఆశలు పెట్టుకునేవారు.

వారిలో చాలామందికి పీడకలలు తప్పించి కలలన్నీ ఎగిరిపోయేయి. ఆశలు అడియాసలయేయి, కాకపోతే ఆశలుగానే నిల్చిపోయేయి. కొంతమంది జీవితాలు మండి తగలబడ్డాయి.

అల్పమైనదే అనుకోండి, కాని, ఏమయిపోయింది వారి ప్రజ్ఞ? ఏదీ వారి ఉత్సాహం? ఏరీ; వీరంతా ఎక్కడున్నారు? ఏ మారుమూలలలో ఇరుక్కున్నారు; ఏవిధంగా బతుకుతున్నారు? ఏయే విధాల బతకలేక చస్తున్నారు? ఒక్కొక్కర్నీ చూడబోయి, అందర్నీ, ఒక్కమాటుగా, మధ్య మధ్య ఒక్కొక్కర్నీ ప్రత్యేకంగా, అందర్నీ మళ్ళీ మళ్ళీ చూస్తున్నాడు సూర్యం.

మీది వరసలో రెండు ఫెజ్ టోపీలు కనిపిస్తున్నాయి. ఒకతను ఏదో ఖాన్ పద్యాలు బాగా చదివేవాడు. ఈమధ్య ఆముదాలవలస స్టేషన్లో శవాకారంలో ప్రత్యక్షమయేడు. రెండో అతనిపేరు ఏదో ఆచారి. క్లాసులో ఒక గర్ల్ స్టూడెంటైనా, ఆఖరికి మన సీనియర్స్‌కి వుండేలాటి కాకిలాటి పిల్లయినా లేదుకదా అని ఎప్పుడూ గోలపెట్టేవాడు. అతనికిప్పుడు ఆరుగురు ఆడపిల్లలు. 'ఛస్తున్నాననుకో భాయీ' అని ఒకసారి కనిపించినపుడు చెప్పేడు. ఎక్కడో ఏ అరవై డెబ్భైరూకలకో అరవచాకిరీ చేస్తున్నాడు. మధ్య వరసలో తెల్లటి టోపీ పెట్టుకున్న కుర్రవాడి

పేరు రామారావ్. ఆ రోజుల్లో వాళ్ళ నాన్న "కాంగ్రెసులో కలిసిపోయే"దని ఆ మధ్య ఎవరో చెప్పారు. ఆ వరసలోనే అతని పక్కనే వస్తాదుల్లా నిల్చున్న ముగ్గురూ బంతాట బాగా ఆడేవారు. వాళ్ళపక్కని నిల్చున్న ఆరుగురూ పిలకలకి తాళ్ళు కట్టుకొని ముగ్గురేసి చొప్పున "కంబైన్డ్ స్టడీస్" చేసేవారు. పరీక్షలకి, వాళ్ళ ప్రాణాలకీ లంకె. చదివి పాసవకపోతే వాళ్ళకి మరే ఆధారం లేదు. చదువుమీద బ్రతకవలసినవాళ్ళు చచ్చేట్టు చదవక తప్పదు. ముందు వరుసలో ఎడమ చివర గుండులా నిల్చున్నవాడికి చదువు సంధ్యల్తో పనిలేదు. వాడికి అప్పట్లో ఇద్దరు ముండలుండేవారట. ఆ వరసలోనే రెండవ చివర నిల్చున్న వాని గుండె కనిపిస్తోంది కాని పిలక కనిపించడం లేదు. ఆ పంతులుకి అప్పటికి ముగ్గురే పిల్లలు. ఆ వరసలోనే అతనిపక్కగా వరసగా ఈవెనింగ్ డ్రస్‌లో నిల్చున్న అయిదుగురూ అయిదుగురు మనుష్యుల కొడుకులుకారు. అయిదుగురు ఆఫీసర్ల కొడుకులు. వాళ్ళలో వాళ్ళకి పడకపోయినా పైకి కలిసికట్టుగా తిరిగేవారు. అదేవరసలో ముంగి ముఖం వాని కుడిపక్కని ఏమీ ఎరగనట్టు నిల్చున్న ఈడురాని కుర్రవాడు పెద్ద చదువుకి ఇంగ్లాండు వెళ్ళేట్ట. పెళ్ళాడ్డం 'దొరసాన్ని' పెళ్ళాడేట్ట. ఇప్పుడు ఇరాన్‌లోనట పనిచేస్తున్నాడు. అతగాడి ప్రక్కనే వున్నవాడు పల్చగా వున్నాడు. బేలగా చూస్తున్నాడు; అతను హాస్టల్లో చివరిగది కిటికీలోంచి ఎల్లప్పుడూ సముద్రంలోకి చూస్తూ ఉండేవాడు. బొద్దుమీసాలవాడు మీది వరసలో మధ్యగా నిండుగా నిల్చున్నాడు. అతను, పాపం, మిక్కిలి అమాయకుడు. అతని ఎడమపక్కని నిల్చున్న అతని ప్రాణస్నేహితుడిది దొంగ ముఖం, దింపుడు చూపు. వాడిపక్కనే నిల్చున్నవాడు పల్చగా పొట్టిగా పిల్లిలా కన్పిస్తున్నాడేకాని అతనికి కనపడ్డ ఇంగ్లీషువాణ్ణల్లా కాల్చేద్దామన్నంత కోపం ఉండేది. అతనికి ఎడమగా నిల్చున్నవాడు, కాలేజీలో ఏ మీటింగు జరిగినా తన పిల్లి గొంతుకతో ప్రార్థనపాట పాడి తీరవలసిందే. వీరిలో ఎవరోకాని ఒక కవి వుండాలే కనిపించదేం?

లాంతరు వెలుగు తగ్గుతోందా అని అటువైపు అనుమానంగా చూసి ఫొటోని దీపానికి ఇంకొంచెం దగ్గరపెట్టి చూసేడు సూర్యం.

ఫొటోలో వున్నవారిలో చాలామంది ఉత్సాహంతో, ఏ కొద్దిమందో కొంత భయంతో, మొత్తంమీద అందరూకూడా ఎక్కువ క్యూరియాసిటీతో చూస్తున్నారు.

"వారి భవిష్యత్తులోకి కాబోలు."

మా జీవితాల్లో ముందుకి ఏం జరుగుతుంది? ఏం జరుగుతుందో ఏమైనా కనిపిస్తోందా? అన్నట్టుగా అంతా చూస్తున్నారు.

ఆగకుండా ఎక్కడికో వెళ్ళిపోతోన్న కాలంలోంచి లాగి నిలవేసి ఈ ఫొటోలో ఈ రీతిగా బంధించిన ఆ ఆగిపోయిన ఆ ఒక్క అరక్షణంలో తమ భవిష్యత్తులోనివి ఏం కనిపించినట్టు వారికి?

నిజం కనిపిస్తే ఇలా ఉండరే వీరంతా!

ఆ నాటి సాయంకాలం వారికి చాలా విషయాలు కనిపించి ఉండవు. ఎన్నో సంగతులు తెలిసివుండవు. ఊహించుకొనైనా ఉండరు. ఆరోజు తరువాత ఈ మధ్యకాలంలో వారి జీవితాల్లో జరగినవి, తాను తెలుసుకున్నవి; చాలా విషయాలు స్ఫురణకి వచ్చేయి సూర్యానికి.

తన కొడుకుమీద కేసు ఏమవుతుందో, ఆ ఆఫీస్‌ప్యూన్‌కి; తన మనవరాలి గొంతుక్కోసేవాడు తన వెనుకనే ఉన్నాడని, ప్రిన్సిపాల్‌గారికీ; పెద్దపులి తన నాలుగో పెళ్ళాం రూపంలోకి వస్తుందని, ఆ జువాలజీ లెక్చరర్‌కీ; తిండిలేక చస్తానని, మధ్యవరసలో ఉన్న ఆ పొడవాటి కుర్రవానికి; ఈర్ష్యతో, కావేషంతో, కక్షగట్టి తన కుడికాలు విరగ్గొడతారని, ముగ్గుర్లోనూ మధ్యనున్న ఆ ఫుట్‌బాల్ ఛాంపియన్‌కి; బికార్నయి బిచ్చమెత్తుకుంటానని, పై వరసలో పిల్లిలా కనిపించే పడుచువానికీ; లోకానికొక ఆఖరి ఉత్తరం రాసి ఆత్మహత్య చేసుకొంటానని, కిటికీలోంచి ఎప్పుడూ సముద్రం చూసే ఆ పల్చటి పిల్లవానికీ; మూడో కూతురు ముండమోస్తుందని, ఆ పిలకపంతులుకీ; ఆరుగురూ ఆడపిల్లలే పుడతారని ఆ ఆచారికి; వర్క్‌షాపులో కుడిచెయ్యి తెగిపడుతుందని, రెండో వరసలో నలుసులా నిల్చున్న చిన్నవానికీ; పక్కనే నిల్చున్న తన ప్రాణస్నేహితుడే తన భార్యని చెరుపుతాడని, ఆ బొద్దు మీసాలవానికీ –

తెలియవు. ఆ సాయంకాలం ఆయా విషయాలు వారెవ్వరికి తెలియవు.

ఏమి జరుగుతుందని చూస్తున్నారో ఆ కాలం అప్పుడే చాలామట్టుకు జరిగిపోయింది. వారెదురు చూస్తోన్న ఆ భవిష్యత్తు వారిలో చాలా మందికి పెనుభూతం అయింది.

ఈ కుర్రవాడిక్కూడా అంతే!

చివరివరసలో కుడివైపు 'బంట్రోతు' పక్కనే నిల్చున్న కుర్రవాడు చేతులు కట్టుకొని, తల కొంచెం ఎత్తి "ఏముంది నా జీవితంలో?" అన్నట్టుగా, మిక్కిలి కుతూహలంతో చూస్తున్నాడు. కుడివైపుకి ఎత్తుగా లేచిన క్రాఫింగు పక్కలకి షోగ్గా జారిన కనుబొమలు, కొంచెం విప్పారిన కళ్ళు, కిందికీ దిగుతూ ఎత్తుగా లేచిన ముక్కు, ఒక్కరవ తెరుచుకొన్న నోరు. ఏం కనిపించింది ఆ సమయంలో ఆ కుర్రవాడికి?

ఏం చూసేడో!

కాని, ఆ క్షణంలో, భవిష్యత్తులోకి చూస్తోన్న అతడి కళ్ళకి టైపు మెషీనులు మాత్రం కనిపించి ఉండవు.

ఉఁ హూఁ! అవి కనిపించలేదు.

అంతేకాదు.

తల తిరుగుడు సుబేదార్ మేజర్‌కి లెంపకాయలాగిన తన తండ్రి జెయిలుకి పోతాడనీ, అంతటితో ఆ ఏడే తను చదువాపవలసి వస్తుందనీ, ఆ వెంటనే టైప్ రైటింగ్ నేర్చుకోవలసి ఉంటుందనీ, ముక్కవాసనవేసే గదుల్లో ఊడిగం చేయక తప్పదనీ, తాళికట్టి తెచ్చుకున్న పువ్వులాటిపిల్ల వత్తిలా ఎండిపోతుందనీ, ఇద్దరు పిల్లలు ఎలా వచ్చినవాళ్ళు అలానే పోతారనీ, ఇంట్లో నోళ్ళన్నీ ఎపుడూ తెరుచుకొనే ఉంటాయనీ, కంపెనీలచేత మనుష్యులు దివాలా తీయిస్తారనీ, నడివయసు దాటేక నట్టడవిలో కొత్తకాపరం పెట్టవలసి వస్తుందనీ....

చాలా విషయాలు కనిపించలేదు. చాలా భోగట్టాలు తెలియవు ఆ కుర్రవాడికి ఆ సాయంకాలం.

పదిగంటల రాత్రి చాలా సేపయింది దాటిపోయి.

ఫొటోలో ఆ కుర్రవాణ్ణి కొంతసేపు చూసి, సందుగు పెట్టె మూతకి లోపలిభాగంలో ఉన్న కళాయిపోయిన అద్దానికి ముఖాన్ని దగ్గరగా పెట్టుకుని ఒక్కసారి చూసుకున్నాడు.

చూచుకొని "అయ్యో! పోలికలేదు" అనుకున్న సూర్యానికి జ్ఞప్తికి వచ్చింది ఒక్క విషయం.

గుంపులు గుంపులుగా చేరిన జనమంతా గుండ్రంగా నిల్చొని చూస్తూ ఉంటారు. కళ్ళకి గంతలు కట్టుకొని, మధ్యని కూర్చున్న కుర్రవాణ్ణి, నాటుఫిడేలు వాయించడం టక్కున ఆపిన గారడీవాడు వేస్తాడు ప్రశ్న.

"అబ్బాయ్! సూర్యకళా? చంద్రకళా?"

గారడీవాని ప్రశ్న. గుంపులో కుర్రవాడి కెదురుగా నిల్చొన్న వెంకటసూర్యం చెవుల్లో గింగురుమంది. ఇప్పటికీ గింగురు మంటోంది.

ఏమంటాడు ఆ కుర్రవాడు? తనని చూపిస్తే ఏమంటాడు?

"ఉస్తాద్! సూర్యకళాకాదు. చంద్రకళా కాదు. ఇది ప్రేతకళ."

ఫొటోని మరొక్కసారి చూసి, దాన్ని పక్కగాపెట్టి నిట్టూర్చిన వెంకటసూర్యం, పెట్లోంచి మిగతా కాయితాల్ని మెల్లగా తీయనారంభించేడు.

●

---

*ఆంధ్రపత్రిక, 13-1-1954.*